# భక్తతుకారాము

మద్దూరి శ్రీరామమూర్తికవి
విరచితము.

రెండవ కూర్పు 1250





పబ్లిషరు
కొండపల్లి వీరవెంకయ్య
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో.,
రాజమండ్రి.

శ్రీ చింతామణీ ముద్రాలయమందు ముద్రింపబడినది.
రాజమండ్రి.
1938.

 [వెల రు. 0—12—0.

# పీఠిక

తుకారాము చరిత్రమును నాటకరూపమున వ్రాయవలయునను సంకల్పంబున నాకు లభించిన వచనగ్రంథముల నాధారముగా గొని యీనాటకమును వ్రాసియున్నాఁడను. గ్రంథముయొక్క నామమే ఇంము భకి ప్రభావము వెల్లడించునని స్ఫురింపజేయును. ఇందు భక్తాగ్రేసరుండగు తుకారాము తన భక్తిప్రభావమున పాండురంగ విఠలునియనుగ్రహమును బడసి యెట్టి లోకోత్తరచరిత్రుడయ్యెనో నిరూపింపఁబడెను. మాస్వాజీ యను జటదారి తుకారాముని పెక్కువిధముల బాధించియు కృతకృత్యుఁడు గాఁజాలక భక్తిమార్గమే మోక్షసాధనమునకు దగినదని యంగీకరించి భక్తుఁడగును.

ఈనాటకరచనమున భక్తిభావ మెంతవరకు పోషించి యుంటినో చదువరులే నిర్ణయింపవలయును.

కాకినాడ,
22—1—38

ఇట్లు
మ. శ్రీరామమూర్తి కవి.

# ఇందువచ్చు పాత్రలు

## —: పురుషులు :—

తుకారాము—భక్తాగ్రేసరుఁడు.

మాస్వాజీ—జడదారి.

వల్లభదాసు—తుకారాముని తమ్ముఁడు

పాండురంగ విఠలుఁడు.

## —: స్త్రీలు :—

జీజీభాయి—తుకారాముని భార్య

ఇఁకను సందర్భానుసారముగా వర్తకులు, మాస్వాజీ శిష్యులు, పండితులు మున్నగువారు వత్తురు.







# భక్త తుకారాము.

## ప్రథమాంకము.

### ప్రథమరంగము.

తుకారాము గృహమునందలి గది.

(తుకారాము పాండురంగని పూజించుచుండగా తెర యెత్తబడును.)

తుకా—హే జగన్నాటకసూత్రధారీ ! నీవిలాసములు వర్ణనాతీతములై యవాఙ్మానసగోచరములై యున్నవి కదా?

సీ. ఒకమారు నీనామ ♦ ముచ్చరించిన నాయ
జామిళు నేలు వా ♦ త్సల్యగరిమ
ఎంగిలిఫలముల ♦ నిచ్చిన శబరికి
కైవల్య మిచ్చిన ♦ కారుణికము
శరణు గోరినయంత ♦ శత్రుని తమ్మున
కభయ మొసంగిన ద ♦ యారసంబు
నీవె నా దిక్కని ♦ యెంచిన గజరాజు
గాచినయట్టి య ♦ ఖండప్రేమ
కొంత నాపైన నిల్పి హృ ♦ దంతరమున
నిల్పి నిన్నె పూజించెడు ♦ నియతిగల్గి
యుండునట్టు లనుగ్రహింపు ♦ మో శుభాంగ!
భక్తహృత్పద్మసారంగ! ♦ పాండురంగ!!

సంసారాంధకారంబునం బడి తపించుచున్న నన్నుద్ధరింప నీవ సమర్థుఁడవు. నీపదరాజీవసంసేవనమే సంసారసాగరోత్తర హేతు వగు నావ. రంగా! రంగా!! పాండురంగా! నాహృదయ మెప్పు డును భవత్పాదపంకేజధ్యానాసక్తమై యుండున ట్లనుగ్ర హింపుము.

(ప్రవేశము:—జీజీభాయి)

జీజీ—నాథా! నాథా!! తమ రింకను పరమేశ్వరారాధనము ముగిం పనేలేదా? లెండు! లెండు! ఇంటిలోనికిం గావలసిన పదార్థ ములనైనఁ గొనివచ్చినపిమ్మట మరల పూజసము సలుపవచ్చును.

తుకా—ఏమి! రంగని సేవించుటలో నెక్కువకాలమును గడపితినా?

జీజీ—అవును. ఉదయమునఁ గూర్చుండిరి. జాముపొద్దెక్కిన దిం కను లేవరైరి.

తుకా—ఆహా! ఒక్కజాముకాల మాహరినామసంస్మరణ మాచరించు టచే ధన్యుఁడనైతిని. ప్రియా! ఇంతకంటె వాంఛనీయ మింకొకటి కలదా!

జీజీ—తమబోంట్లకట్లే యుండునుగాని—

తుకా—సంకోచింతు వేల? నివాక్యమును పూర్తి చేయుము.

జీజీ—భక్తజనులగు మీకు ఆకలిదప్పులు లేవు గాని, యింట నుండు వా రందఱికిని యాకలి తప్పునా? వారి కింత జీవనోపాధి గల్పించి మీరు నిశ్చింతగా రంగని స్మరించుకొనుచుఁ గూరుచుండుఁడు.

తుకా—ఎంత వెఱ్ఱిదానవు. పుట్టించినవాఁడు పోషింప కూరకొనునా? పరమకారుణికుండగు భగవంతుఁడు నిర్దయాసూన్యుఁ డను కొంటివా?

తే. నీటఁ దిరిగెడి చేఁపల ♦ నింగి దిరుగు
విహగముల భూమి నివసించు ♦ వివిధజంతు

సాంతిటికిని యాహార ము ♦ సంగువాఁడు
గలుగ, మనుగడకొఱకు చిం ♦ తిలఁగ నేల ?
ఊరక సంసారతాపత్రయమును నల్లాడనయంత మేలు కలుగునా?

జీజీ—ఇదెక్కడగోల దాపురించినది. నాథా ! నేను మీ వేదాంతోప దేశముల నాలించుటకు రాలేను. నాకు తీరికగూడ లేదు.

తుకా—మఱెందులకు వచ్చితివి. నీవుగూడ నాతో రంగని సేవింపవల యునను కుతూహలముల జను దెంచియుంటి వని తలంచితిని.

జీజీ—ఇంట పదార్థములు నిండుకొన్నవి. అంగడికి పోయి రాకున్నమె డల నీదినమున నింటియందలివారెల్ల రుపవసింపవలసినదేలెండు. పిల్లలవుడే యాకలిబాధ కాగలేక గోల పెట్టుచున్నారు.

తుకా—అయిన నాకడ కేల వచ్చితివి ?

జీజీ—నుఱేమి చేయుమందురు ?

తుకా—అన్నగారితో నీసంగతియంతయుఁ దెలుపుము.

జీజీ—అక్కడకుఁగూడఁ బోయి వచ్చితిని.

తుకా—వా రేమనిరి ?

జీజీ—తమకేగాని గృహవిషయము లాయన కేమియుఁ దెలియవని నుడివియుండిరి.

తుకా—అగ్రజుఁడైనందుల కాతఁ డీసంసారబాధ్యత వహించిన నేను నిశ్చింతతో పండరినాథుని నిరంతరభక్తితో సేవింపఁగల యవ కాశము లభించియుండెడిది కదా ? ఇంతకును విధివ్రాత యను ల్లంఘనీయము గదా ?

జీజీ—అంగడి కేగి వచ్చినపిమ్మట సావకాశముగాఁ గూర్చుండి యాలో చించుకొనవచ్చును. ముందుగా నంగడి కేగి పదార్థములఁ గొని తెండు. ఇంకను జాలముచేసెద రేల ?

తుకా—సంసారపరిస్థితులను గూర్చియే యాలోచించుచుంటిని. యుక్త వయస్కులై, యుక్తాయుక్తపరిజ్ఞానశీలురైన సోదరులు కుటుంబరక్షణమున నాకొకింత తోడ్పడిన నెంతసహాయకారిగా నుండును. అట్టిది నానుదుట వ్రాయఁబడియుండలేదు. కావల సిన పదార్థము లేమి ?

జీజీ—అక్కఱలేని పదార్థ మున్నదా యని యడుగుదు. నేఁడు సమస్త పదార్థములను గొనిరావలయును. ఇంట కట్టెలైన లేవు.

తుకా—మంచిది. త్రుటిలో నంగడి కేగి వచ్చెదను.

(నిష్క్రమించును)

జీజీ—పాండురంగభజనమునఁ బడి సంసారమే మఱచుచుందురు. అట్టి వీరిపై మేమెల్లర మాధారపడియుంటి మింకెట్లు లీసంసారము కొనసాగునో దైవమునకే యెఱుంగఁదగును. సామగ్రిని వారు గొనితెచ్చునంతలో స్నాన మొనర్చెదఁగాక.

(నిష్క్రమించును.)

## ద్వితీయ రంగము.

తుకారాముని మందిరమున నొకగది.

(తుకారా మొకయాసనముపైఁ గూర్చుండియుండును. ఇంచుక దూరమున జీజీబాయి నిలువఁబడియుండఁగాఁ దెరలేచును.)

జీజీ—నాథా! ఏమో చెప్పుచుంటినని భావింపవలదు. కష్టసుఖముల నాలోచింపుడు. దినవెచ్చమునకే తడుముకొనుచు నెన్నిదినములు గడుపఁగలము.

తుకా—అవును. నీవు వచించినవన్నియు సత్యము లనుటకు సందియము లేదు.

జీజీ—కావున ధనార్జన సేయుటకు యత్నింపవలయును.

తుకా—ఏమార్గమున-అన్యాయమార్గమున విత్త మార్జించినను మన ముద్దానిని దినఁజాలము సుమా!

జీజీ—అన్యాయమున కేల యొడికట్టవలయును.

తుకా—అట్లయిన నామార్గ మేమో బోధింపుము.

జీజీ—కులక్రమాగతమగు వర్తక మున్నది కదా?

తుకా—వర్తకమా! అది నాచేతఁ గాదు. అంతటి యన్యాయమునకు నే నొడిగట్టజాలను. వర్తకమువలన ధనార్జన సేయుట ఋజు మార్గము గాఁజాలదు. లోకమునఁగల యన్యాయ మంతయును వర్తకమున నున్నదనుట కేమియు సందేహ ముండబోదు.

సీ. చెడురకంబులఁ దెచ్చి ♦ సింగార మొనరించి
యిదె మంచి దనుచు వ ♦ చింపవలయు
తక్కువరకముల ♦ నెక్కుడు వెలలకు
హితులకేనియు విక్ర ♦ యింపవలయు
అదనున ధరలను ♦ నమితంబుగా బెంచి
ధనమె ప్రాణముగాగ ♦ దనరవలయు
ధనికుల వంచింప ♦ ననువైన విధమున
కల్లలాడఁగఁ గూడఁ ♦ గడఁగవలయు
తూకములపట్ల తక్కువ ♦ తూచియిచ్చి
కొలతలందున తలగొట్టి ♦ కొలిచియిచ్చి
మెల్లరనుఁ గూడ నొకట వం ♦ చింపవలయు
నట్టి వర్తకమందు న్యాయంబుగలదె?

జీజీ—మీయుపన్యాసము వినుట కెంతయు నింపుగా నున్నది. కులక్రమాగతమగు వర్తక మన్యాయయుతమైనదైనచో నింక నవలంబింపవలసి వృత్తి వేఱొకటి కలదా? ఉద్యోగముల సేయుటకు నూళ్లేలుటకుఁ దగిన శక్తి లేనినాఁడు అవలంబించుట కనువైన వృత్తి వేఱొకటున్నదా?

తుకా—ఏమో! ఆ విషయనిర్ణయము గావింపఁజాలను.

జీజీ—వర్తకము గాకున్న మఱే యితరమార్గమున ధనార్జన సేయఁగలరో వచింపుఁడు. నేఁటి దేశపరిస్థితు లెట్లున్నవో యించుక గమనింపుఁడు. నేఁడు ధనవంతుఁడె సర్వత్ర పూజింపఁబడుచున్నాఁడు. ధనవంతునకుఁ గులగౌరవముతో నిమిత్తము లేకుండ నెల్లరును యడుగులకు మడుగుల నిడుచు జోహారు లొసగురు. వేయేల? 'ధనమూల మిదం జగత్తె'ను పల్కులను తమ రాలింపలేదా? యావిషయ మటుండుఁడు. నిర్వ్యాపారముగఁ గూర్చున్నచో నెన్నిదినము లీసంసారము గడువఁగలదు.

తుకా—అయిన నన్నేమి చేయుమందువు?

జీజీ—వర్తక మొనరింపుఁడు. ఇంతకంటె సులభముగా ధనము గణింపఁగలమార్గ మొక్కటియును గాన్పింపదు.

తుకా—వర్తకమనిన నీకంత చులకనగాఁ గాన్పించుచున్నది కాబోలును! ఇప్పటి వర్తకపరిస్థితు లెట్లున్నవో యించుక వివరించెద సావధానముగ నాలింపుము.

సీ. అరువులఁ గైకొంచు ♦ నడిగిన యపుడెల్ల
నిదె యిచ్చెద నని వచించువారు
అరువుల నెగబెట్టి ♦ నహరహంబును చింత
నలుపుచు యత్నముల్ ♦ నలుపువారు

బేరాన నిసుమంత ♦ భేదంబు గనుపింప
కడకొట్టునకుఁ బోవఁ ♦ గడఁగువారు
అరువిచ్చునందాక ♦ విరివిగా వాడుచు
తరువాత పెరవీధి ♦ కరుగువారు
ఈయవలసిన పైకంబు ♦ నీయుమనిన
నెంతయో గోల నొనరింప ♦ నెంచువారు
ప్రబలియున్నట్టి పాడు ప్ర ♦ పంచమందు
వర్తకము సేయఁగలది లా ♦ భంబు చెపుమ.

జీజీ——జాగరూకతతో బేరసారములఁ జూచుచున్నయెడల దండుగ వచ్చునా?

తుకా——ఊరక నన్నేల శ్రమపెట్టెదవు. వర్తకమున మన కెట్టిలాభమును గలుగఁబోదు. నాపల్కు లాలింపుము.

జీజీ——ఈమార్గమును త్యజించునెడల జీవితమునకు మార్గమేమున్నది. కావున తప్పక వర్తకమునే చేయవలయును. మీకుఁ దీరికయున్న మీరును, మీకు దీరిక లేని సమయములందు మీసోదరుఁడును దుకాణముపై గూర్చుండవచ్చును. ఏదో కొలఁదిగా లాభము వచ్చుచున్నయెడల దేహీ యని యొరులను చేఁజాచి యాచింపకుండ కాలయాపన చేయవచ్చును.

తుకా——వర్తకము వర్తకమని పలువరించెదవు? పెట్టుబడికైన ధనముండవలదా?

జీజీ——మన మింట నుపవాసములఁ జేయుచున్నను పరపతి నశింపకుండ గాలయాపన సేయుచుంటిమి. మీరడిగిన సాటివర్తకు లెవ్వరైన దోడ్పడుదురు. వారియొద్ద కేగి సరకులఁ గొనిరండు. అమ్మినపై చినసిమ్మట వారలసొమ్మును పున్వ్వలలోఁబెట్టి యప్పగింప వచ్చును.

తుకా—అరువుసొమ్ములఁ దెచ్చి వర్తక మొనరించుటకంటె హైన్య ముండునా?

జీజీ—పోనిండు. మాజనకునడిగి రెండువందల దీనారములఁ గొనివచ్చెదను. అద్దానిని మూలధనముగా నుపయోగించి వర్తకమును సాగింపుడు.

తుకా—ఋణమునుసేయుటకు ప్రారంభింపుమందువా?

జీజీ—అన్నిటికిని యన్నివంకలు పెట్టుచుండ నేనేమి సెప్పుదును. పోనిండు నామేనిపైనున్న వస్తువులను విక్రయించుడు. లాభము వచ్చినయెడల నేడుగాకున్న రేపటిదినముననైనను వస్తువులను చేయించుకొనవచ్చుచు. ఇంతలో పోవున దేమున్నది?

తుకా—స్త్రీధనము గైకొనుటకు మనస్సు సంకోచించుచున్నది.

జీజీ—నాథా! ఈవస్తువులు మీకొసంగినవి కావా? వీనిని యవసరమునకు మీరుపయోగించుకొనుట తప్పగునా? వలదు మీకట్టి సంకోచము వలదు ముందు జీవయాత్ర కుంటువడక నడచు మార్గమును జూడుడు.

తుకా—మంచిది. కర్తవ్యమును గూర్చి యాలోచించుటకు నాకొకింత విశ్రాంతి నిమ్ము.

జీజీ—అట్లేకానిండు. (నిష్క్రమించును.)

తుకా—పండరీపురనివాసా! శ్రీనివాసా!

గీ. అలఘు సంసారసాగర ♦ మందుఁ జిక్కి
దిక్కుతెలియక తపియించు ♦ దీనజనుని
యుద్ధరింపంగ దగుమార్గ ♦ మొకటి జూపి
రక్షణముసేయుమో పాండు ♦ రంగ రంగ.

నాభార్య పల్కులు నిక్కవములే యని తోచుచున్నది. ఎట్లో ధనమార్జింపకున్న నీసంసారము చక్కబడు టెట్లో దోపకున్నది.

వర్తకమే శరణ్యమనుటయు నిశ్చయము. ఈయూరినుండి సరుకులను గొనిపోవు సార్థవాహులతో బయలుదేరి గ్రామముల వెంట దిరుగుచు వర్తకము సాగించెదగాక. ఇతరవర్తకులు దోడుగానుందురు గావున దంచుగవచ్చునను భయముండదు. దీని గొంతలాభము చేకూరగలదు. ఏమో యెవ్వరుచెప్పగలరు. లాభమువచ్చినను గాకున్నను ఇంట నిర్వ్యాపారముగ గూర్చుంటినని యిల్లాలుచే సూదుమాటలు పడవలసిన పనియుండదు. అటుపైన పరమాత్ముడే గలడు. ఇక నేనేగి తత్ప్రయత్నములో నుండెద.

(నిష్క్రమించును)

---

## తృ తీ య రం గ ము.

---

స్థలము:— ఒకవీధి.

(ప్రవేశము:—వినయుడు, చందుడు అను వర్తకులు)

విన—చందుగారూ! ఈమధ్య బొత్తిగా దర్శనాల్లేవు. గ్రామములో లేరనుకుంటాను.

చం—అవును.

విన—వర్తకనిమిత్తమై వెళ్ళారనుకుంటాను.

చం—అవునండీ! వర్తకం కోసం కాకపోతే నాకు వేరే పనులేమున్నాయియేమిటి?

విన—అక్కడవర్తకమేమైన సాగిందా లేక యిక్కడమోస్తరుగానే వుందా?

చం—ఉంది. ఓ మోస్తరుగా.

విన—ఇక్కడకన్న నయం అనుకుంటా,

చం—ఏమో! పూనాలో వర్తకంబాగుంటుందని లాభా లెక్కువవ్వుం టాయని ఒక్కవరుసని చెప్పుకుంటున్నారు గదాయని ఒక సబురు వెళ్ళివచ్చాను. ఏవంత యెక్కువమిగులలేదు.

విన—రెండువందలుంటాయా?

చం—చచ్చు రెండువందలు, ఇక్కడమాత్రం దొరకవ్వు. పెళ్ళాం బిడ్డలు నొదలికొని అంతదూరం పోయినందుకు ఒక సంచియైన వుండ వద్దూ. ఖర్చులు మాజాస్తి అయినాయండి. ఇంటికొచ్చేటప్పటికి ఎనిమిదివందలు మిగిలేయి.

విన—ఇకనేం కోటలో పాగా వేశారన్నమాటే.

చం—ఏదో దేముని దయవల్ల.

విన—మళ్ళీ వెడతారా. రుచిమరిగినతర్వాత విడిచిపెట్టడం ఉండదను కుంటాను.

చం—ఇంకా రావలసిన బాకీలున్నాయి వెళ్ళకపోతే అవన్నీ గంగలో కలిసేయున్నమాటే.

విన—ఈమాటు మమ్మలిసికూడా లాక్కుపొండి. ఇక్కడవర్తకమంతా అడుగంటింది.

చం—మిమ్మల్నే ఎత్తుకు తీసుకెళ్ళాలా! రండి కలిసిపోదాం.

విన—నలుగురుం ఒకచోటుంటే కాలక్షేపానికేం లోటుండదు. ఖర్చులు కూడా తగ్గుతాయి.

చం—అవును. తుకారాం కూడా వస్తానంటున్నాడు.

విని—అతనికూడా బుద్ధిపుట్టిందీ వర్తకం చెయ్యాలని.

చం—అవును. ఏం జేస్తాడు. సంసార అంతా చుట్టబెట్టుకు నెత్తిమీాద పడింది. ఏవర్తకమోచేసి నాలుగురాళ్లు సంపాదించకపోతే గడవద్దూ.

విన—అవును. అతన్నికూడా లాక్కుపోతే భుక్తితోడు ముక్తికూడా కలుగుతుంది.

చం—(దూరమున చూచి) అదుగో! తుకారాం కూడ మాటలోనే యిల్లావస్తున్నాడు.

(ప్రవేశము:—తుకారాం.)

తుకా—చందూ! నీకోసం యింటికెళ్లొచ్చాను.

చం—ఎందుకునేనేవస్తానని చెప్పేనుకదూ.

తుకా—ప్రయాణమునకు రేపటిదినమున చాల బాగున్నదని విని యీసంగతి నీతో చెప్పుదామనుకొని బయలుదేరేను.

చం—రేపే ప్రయాణము కావలసియున్న యీదినముననే బజారులో సరుకులు కొనవలయును.

తుకా—అందుకే యుదయముననే నీతో జెప్పటకై వచ్చితిని.

విన—నన్నుకూడా లాక్కుపోతారన్నమాటే.

చం—అభ్యంతర మేమిటి?

తుకా—చందూ! నాకీవర్తకము మిగుల క్రొత్తది ఎట్టిసరుకు లాదేశమున సులభముగ విక్రయింపబడునో వానిని నీవేయెంచి కొని పెట్టవలయును సుమా

చందు—మంచిదట్లనే గావించెదను. ఈమాత్రమునకు నీవు నన్నింతగా కోరవలయునా?

విన—రండు. ఇంకను ఇక్కడనే కూర్చుండిన బేరసారములకు వేళ దాటిపోవును.

(ముప్పురును నిష్క్రమింతురు.)

---

## తృ తీ య ర ం గ ము

---

### అరణ్యమందలి యొక సమమగు ప్రదేశము.

(ప్రవేశము:—చంద్రుఁడు, వినయుఁడు, తుకారాము, మరికొందరు
(వర్తకులు, పరిచారకులు.)

చం—వినయా ! నేటికి మనమీయరణ్యముననే విశ్రాంతి గైకొనవలయును. ముందు రెండామడల దూరమువరకును బసదిగుటకు దగినప్రదేశ ముండదు. ఎకాఎకి నింతదూరము నడచినయెడల మనము శ్రమజెందుటయే కాక ఎడ్లును వేసడములును గూడ అలపుజెంది ముందు ప్రయాణముచేయుట దుష్కరమగును.

విన—ఈసమీపమున నెచ్చటనైన నీరమున్నదా ?

తుకా—ఎడ్లు దాహముచే నాలుకలు జాపుచున్నవి.

చం—ఆపొదమాటుననే చక్కని సెలయేరుగలదు.

విన—దిగుటకు అనువుగానుండునా ?

చం—ఈస్థలముయొక్క సంగతి నీవెరుగమిచే నీవట్లనుచుంటివి వెనుక మేము పదునైదు దినములవరకు నిచ్చటనే నిలువవలసివచ్చినది. ఒక్కనాడైనను కష్టమనునదియే యెఱుంగక హాయిగా గడపితిమి. పశువుల నాసెలయేటిగట్టున నొక్కగడియ యేపిన చాలదా ! ఎంతరుచ్యములగు పండ్లీప్రదేశమున దొరకును నను కుంటివి?

తుకా—పరిచారకులకు ఇచ్చట విడియుచున్నామని దెలుపవలదా ?

చం—మనకు ఆశ్రమతో నిమిత్తములేకుండ వారప్పుడే సామానుల దింపివైచి బండ్లను సెలయేటికి దీసికొనిపోవుచున్నారు. అల్లదే చూడుము.

విన——ప్రయాణపు బడలికవారు గించుక విశ్రమింతము.

(అందరును తలకొక ప్రదేశమునను మేనువాల్చి విశ్రమింతురు.)

తుకా——మార్గాయాసముచే వీరు నిద్రపోయిరి కాని నాకేలనో అనిద్రరాకున్నది. పండరీపురనాథుని మనసార కీర్తించుచు జన్మ తరింపజేసుకొనుటకు తగిన యవకాశము నేఁడు కదా లభించెను. విఠోబా నామసంస్మరణ మాచరించుచు నడచివచ్చుటచే గాబోలు మార్గాయాసమిసుమంతయు దోపకున్నది. ఇంతమాత్రమునకే యాపండరీనాథునికి నాపై ననుగ్రహము జనించిన నిరంతరము తదేకధ్యానాసక్తుఁడై తన్మయానందచిత్తుఁడై నామసంకీర్తన మాచరించు ధన్యాత్ముల నాపరమాత్మ యేరీతి ననుగ్రహించునోకదా! ఆహా! ఇతరేతరవ్యాపార ప్రసక్తి లేకుండ విఠోబాసేవయందు నిరంతరము వర్తింపగలుగుట పురాకృతసుకృతఫలమని భావింపవలయును కదా! బండరీనిలయుని నిశ్చింతతో సేవించు నవకాశము లభించుటెన్నఁడో గదా! అహో! అంతటిభాగ్యము నాకు చేకూరునా? దారేషణ పుత్రేషణ ధనేషణంబుల జిక్కువడి నారకసదృశంబగు సంసారవారాసి నిర్మగ్నుఁడై పరితపించు నాయట్టివాని కట్టి సుకృతము లభించునా!

(ధ్యానాసక్తుఁడై యుండును.)

[ఇతర వర్తకులు మేల్కాంతురు.]

విన——చందూ! ఎంతతడవు నిద్రించితిమి? ఇంకనైనను పరిచారకులేమిసేయుచుండిరో పరికింపవలయును. మనమందఱ మిచ్చట నిద్రించుచున: వారును దమ యిచ్చవచ్చినట్లు విహరించుచుండిరేమో! వంట గావించిరో లేదో?

చందు—ఇంకను ప్రొద్దు నడినెత్తికి రానేలేదు. ఇప్పు డేమంత తొం దర. ఇంతయెండలో పయనము సాగించుట దుర్ఘటము కాదా?

1 వర్త—మనము భోజనాధికముల ముగించుకొనునంతకు పొద్దు తిరుగకపోదు లెమ్ము.

చందు—అబ్బా! మిాకు ప్రయాణ మసాధ్యముగా నున్నది (లేచును)

వినయ—రమ్ము రమ్ము. పరిచారకులకు సామానుల నప్పగించి నిద్రించుచుంటిమవి యేమైనవో యేమో!

[వినయుఁడు మున్నగువారందఱును నిష్క్రమింతురు]

తుకా—(ధ్యానసమాధినుండి మేల్కొనును) ఆహా ఈనిర్జనస్థలమున పాండురంగని ధ్యానించుచుండ నేదో మైకము క్రమ్మినట్లయ్యెను. కావుననే మహాత్ములు నిర్జనంబులగు నరణ్యంబుల నిష్ఠాగరిష్ఠులై తప మాచరించుచుందురు. (ఇటునటు పరికించి) ఎవరీ వర్తకులు? వీ రెందుఁబోయిరో కదా? న న్నీయరణ్యంబున నొంటి విడచి యెందేగిరో కదా? అదే. ఆవటవృక్షము చెంత నాశీనులై భోజనము లారగించుచుండిరి. మరల వెంటనే ప్రయాణ మగుదురు కాఁబోలును, వారితోఁగూడ బయలు దేరవలయును గదా? అందులకుఁ దగుయత్నమున నుండకున్న నెట్లు?

(నిష్క్రమించును)

ఇది ప్రథమాంకము.

———

19



# భక్త తుకారాము.

## ద్వితీయాంకము.

### ప్రథమ రంగము.

ఆరణ్యమున నొక ప్రదేశము.

(తుకారాం యొకచోఁ గూర్చుండి ధ్యానసమాధియం దుండఁగాఁ దెర యెత్తఁబడును.)

తుకా——కరుణాంతరంగా! పాండురంగా! నీతో స్వేచ్ఛావిహారములు సలుపు బ్రహ్మానంద మనుభవించిన యాగోపికలదే జన్మము.

ఉ. ఫుల్లసరోజనేత్ర! తొలి ♦ పుట్టువునందున నిన్నుఁ గూడి సం
ఫుల్లముఖాబ్జలై విపిన భూములలో దిరుగాడుకొంచు న
త్యుల్లసనంబుతో మెలఁగు ♦ చుండఁగ గోరి వ్రతంబు రేమి యా
గొల్లమిటారి గుబ్బెతల ♦ నోటి యొనర్చెనో తెల్ప సాధ్యమే.

యమనియమాదుల శరీరమును కృశింపఁజేయుచు నిష్ఠాగరిష్ఠులై ఘోరతరారణ్యంబుల పవనభక్షులై యేకాగ్రత తప మాచరించు మునికోటికైన దర్శింపఁగారాని నీదివ్యమంగళవిగ్రహము ననుదినంబునను గాంచుచు, నీకు పలయువరిచర్య సలుపుచు, కేవలము నీయానందమే తమయానందముగా మెలంగిన గోపికల పూర్వజన్మసుకృత మెంతని కొనియాడనగును. నేఁడు నేను గూడ నొక గోపికనై యున్న యెడల నీమది కెక్కునట్లుగా పరి

చర్య సల్పి యుండునుగదా ! లేదు. అట్టిసౌఖ్యము నాకు లభిం పలేదు. లభించియేయున్నయెడల నిట్లీకను యీప్రపంచమున నిట్లుండుట చే తటస్థింపకుండును. పండరీనాథా ! అనుగ్రహిం పుము. పండరీవిలయుండవైన నిన్ననుదినంబునను దర్శించుచు సేవించు మహద్భాగ్యము నాకు చేకూఱదయ్యెను. అయినను, నిరంతరము భవత్పాదపంకేరుహధ్యానపారీణుఁడనై నీ దివ్య నామసంకీర్తన మొనర్చుటకుఁ దగినయవకాశమునుమాత్ర మను గ్రహింపుము. తాపత్రయాభీలదవాగ్నులు దహించుచున్నను లెక్కింపక నీదివ్యమంగళవిగ్రహమును హృదయపద్మమునసుస్థి రముగాఁ బాదుకొల్పి సేవించునట్టి యవకాశము లభింపఁ జేయుము.

(ఎద్దులు అఱచును. ధ్యానసమాధినుండి తుకారాం మేల్కాంచి నలువంకలఁ దిలకించును. తోడివర్తకులు కాన్పింపకుందురు.)

తుకా——చింపేఁడుమున్నగువారపుడే వెడలిపోయిరి కాఁబోలును ! ఇందెందును వారిజాడయే కాన్పింపకున్నది. తమతో నరుదెం చుచున్న నన్ను- అన్నిటికిని తామే తోడుగా నుందురని తలంచి వెంట నరుదెంచుచున్న నన్ను- యిట్టీనిర్జనారణ్యమున నొంటి గా విడచిపోవుటకు వారి కెట్లు మనస్కరించెనో దెలియకున్నది. (దూరమునకు దృష్టి సారించి నలువంకలను దిలకించి) ఏమార్గ ము ననుసరించి వారేగియుండిరో తెలియకున్నది. ముందు దగ్గరలో జనసంచార మున్నజాడయే కాన్పింపకున్నది. ఏమి సేయుదును ? ఏమార్గ మనుసరింతును ? కానిమ్ము. అన్నిటి కాపరమేశ్వరుఁడే గలఁడు. పాండురంగా ! యీకీకారణ్యమధ్యం బున వీనిని జిక్కువడజేసిన నేమిసేయునో దిలకింతమని పరీక్షిం చుచుంటివా ?

ఉ. పండరినాథ నీదు పద ♦ పద్మము లాత్మభజించుసట్టి భ
క్తుండు వనాంతరంబునను ♦ దోడొకరుండును లేక జిక్కియె
ట్లుండునో జూడనెంచితె ప ♦ యోధర నీలశరీరపీడుఁ శ
క్తుండగు నాపరీక్షలకు ♦ దూలక నిల్వగనంచు నెంచితే.

నీయొనర్చు పరీక్షలకు నిల్వదగిన శక్తియుతుండనుగాను. ఈవిప
త్పరంపరనుండి నన్ను యుద్ధరింపుము.

(దూరమున జంతువుల కూతలు)

అహా! ఈప్రదేశము క్రూరసత్త్వముల కాకరమైనట్లుఁ గూడ దోచుచున్నది. కావుననే చందురుమున్నగువారు సరిగా నొకింతతడవైనను విశ్రాంతిగొనకుండ నేగియుందురు. అపుడే సూర్యాస్తమయమైనదో లేదో జంతుసంతానంబుల కఠోరరవంబులు వినవచ్చుచున్నవి. నేటిరాత్రి కీప్రదేశమున నిల్చిన మృత్యువదనగహ్వరము ప్రవేశింపగలదనుట కెట్టిసంశయమును యుండదు. హాతవిధీ! యీదుర్గమారణ్యంబుల మరణింపవలసినదని నానుదుట లిఖించియుంటివా? కానిమ్ము. మరణమునకు నేను వెరువను. ఆసన్నమగు మరణము నత్యాదరమున స్వీకరింతును. ఏలనన, మరణమే నన్నీ తాపత్రయంబులనుండి యుద్ధరింపఁదగినదై యున్నది. కాని పాండురంగా, మరల నన్నీ విశ్వమునకుఁ బంపకుము. మరల నన్ను సంసారపయోధిమధ్యంబునఁ గూలఁ ద్రోయకుము. ఏమి నావెఱ్ఱి? నేను కోరినట్టుగా నప్పరమేశ్వరుఁడనుగ్రహించునా? ఏనెంతటి భక్తుడను. జగధీశా, నిన్నే మియు నర్థింపను. నీయిచ్చవచ్చినట్లు గావింపుము.

[తెరలో]

[కట్టుకఱ్ఱలనున్న ఎద్దులు మరల అర్చును. కలవరపడుచుండును.]

తుకా—పాపము! క్రూరసత్త్వములవాసన తగులుటచే గాఁబోలు నెఱ్ఱెత్తి యఱచుచు డెక్కలతో నేల గీరుచు చిందులు త్రొక్కుచు కలవరపడుచున్నవి. మృత్యువన్న ప్రతిప్రాణికినిగూడ భయమే కదా! కానిమ్ము—నానిమిత్తమై యీవృషభములు తమ జీవముల నేల విడువవలయును కట్టుకఱ్ఱలనుండి విప్పివైచినచో నవి స్వీయప్రాణరక్షణార్థము నిరపాయమగు స్థలమునకైన పోఁగలవు.

(తుకారాం లేచి ప్రక్కకు నిష్క్రమించి రెండుమూడునిముసములైనపిమ్మట ప్రవేశించును) ఇంక నిశ్చింతగా రానున్న మరణమును స్వీకరించుటకై పరీక్షించుచు విఠోబానామసంకీర్తన మాచరించు చుండెదఁగాక.

ఆశ్చర్యమాశ్చర్యము! ఈవృషభంబులు కట్టుకఱ్ఱలనుండి విప్పినను యావల కేగక నాచెంతకే యరుదెంచుచున్నవి. ఇంతలో వీనికిఁగల భయ మేమైయుండును. క్రూరసత్త్వములు దవ్వులకేగియుండునా లేక యవికూడ శ్రీరంగనామసంకీర్తన మాలించుటకు నాచెంత కరుదెంచుచున్నవా? ఆ, నాగానమున నంతటి మాధుర్య మున్నదా? పొరపడుచుంటిని. కాదు కాదు. విఠోబానామసంకీర్తనమందు అనన్యలభ్యమగు మాధుర్యము దొలుకాడుచుండును. కావుననే యీవృషభములు చెంత కరుదెంచుచుండెనని తలంతును.

[దూరమున రెండుశార్దూలములు చెరలాడుకొంచు తుకారాము నకుఁ గాన్పించును.]

అదిగో, మృత్యుదేవతాస్వరూపములో యనఁదగు వ్యాఘ్రములు నావంకకే వచ్చుచున్నవి. ఆహా, ఇంకొక కొన్నినిమిషములలో యీతుకారాముని పంచప్రాణములును అనంతదాయు

పథంబున కలియునుగాబోలు ! ప్రియా ! జీజీభాయి ! శతధా పోరి వర్తకదానుమపై నీవర్తకులతోఁబంపి విఠోబాచెంత కేగుటకు సరియైనమార్గమును జూపించితివి.

(ముందునకుఁజూడఁగా వ్యాఘ్రములు దాదవ్వల కేగుచున్నట్లు కాన్పించును)

ఈవ్యాఘ్రములకుఁ గూడ నాపై దయ తప్పెనుగాఁబోలును రంగా! రంగా! ఇదంతయు నీయనూనకటాక్షముచే జరుగుచున్నదని తలంతును. నేనొనర్పవలసిన యేమహాకార్యము గలదని నాప్రాణము నీసమయమున రక్షించితివి. ఆహా ! నీలీలలనంతములు. నీచర్య లసాధారణములు. నీ నామసంకీర్తన మొనర్చుటకంటె నేను చేయగలిగిన దేమున్నది.

(మరల వెనుకటిపాటనే పాడుచుండును.

సూర్యభగవానుఁ డల్లదే తూర్పుశిఖరమున నుదయించుచున్నాడు. ఏమైన గానిమ్ము. ఈపవిత్రప్రదేశమునుండి యొక్కయడుగైనను ముందున కిడఁజాలను. ఈనిర్జరారణ్యమున నిరపేక్షుడనై వాంఛరహితుడనై నిశ్చలనిష్కళంకమగు భక్తితో ఆవిఠోబానే సంస్మరించుచుకూర్చుండెదను.

[ప్రవేశము—ఒక వృద్ధబ్రాహ్మణుఁడు.]

వృ. బ్రా—నాయనా ! ఎవ్వరవు నీవు ? ఈభయంకరారణ్యమున నేమి చేయుచుంటివి?

తుకా—అయ్యా ! నేనొకవర్తకుఁడను. తోటివర్తకు లిచ్చట నన్ను పరిత్యజించి వెడలిపోయిరి.

వృ. బ్రా—అయిన రాత్రిభాగమంతయు నీయరణ్యముననే యుంటివా?

తుకా—ఏమిచేయుమాదురు ? సూర్యాస్తమయ మయినపిమ్మట నే

మార్గమున పోయిన న్బెబ్బులుపుచలఁ జిక్కవలసివచ్చునో యని యిందే యుంటిని.

వృ. బ్రా—ఈప్రదేశము క్రూరసత్వముల కావాసమని పెక్కురు నుడువుచుందురే !

తుకా—ఎవ్వరో నుడువుటేల ? ప్రత్యక్షముగా గతరాత్రియందు రెండువ్యాఘ్రములఁ జూచియేయుంటిని.

వృ. బ్రా—అమ్మయ్యో ! వాటిబారిపడకుండ నీవెట్లు రక్షించుకొనఁగలిగితివి ?

తుకా—అదంతయు పరమాత్మునకే యెఱుక. ఆమెకములురెండును నాచెంతకే రానిండ దూదవృల కరిగినవి.

వృ. బ్రా—అదృష్టవంతుఁడవు నాయనా ! మాతృగర్భమున పునర్భవమొందినట్లుగా దలంపుము.

తుగా—మహానుభావా ! తమరుగూడ నట్లే వచింతురా ? తాపత్రయాభీలదావాగ్నిమధ్యంబునంబడి యడలుచుండు మానవుల కేనాటికైనను మృత్యుముఖమునఁ బడుట తప్పదుగదా ! ఈనాటితో నాకష్టములనుండి విముక్తి నొందఁగలనని యూసించితిని గాని నాయూస యడియాస యైనది. ఆవిఠోబాదేవున కింకను నాపైననుగ్రహము కలుగలేదుకాబోలును.

వృ. బ్రా—ప్రాయమున మిగుల చిరుతవు. నీపల్కులు పరమవేదాంతగర్భితములు. ఇంతటి చిరుతప్రాయముననే నీకింతవేదాంతమెట్లు లభించెను ?

గీ. అరయ చిరుతప్రాయము తొలు ♦ కాడుచుండె
పలుకుచుంటివి సంసార ♦ బంధములను
విడచిన విరాగికైవడి ♦ వింతగాను
ఇంతవైరాగ్య మెటు లభి ♦ యించె నీకు?

తుకా—మహానుభావా! తమ రెవ్వరో నేనెఱుంగను. కాని తమ్ము చూచినంతనే మహానందము గలుగుచున్నది మీప్రశ్నమున కెట్లుత్తరమీయవలెనో తోపకున్నది. జనించినందులకు నోపిన కొలంది పరమేశ్వర సంకీర్తనముసేయుచు వేఁడి పరులచే జూపించుకొనకుండ జీవించినవానిదేగదా జన్మము. బుద్బుదప్రాయమగు నీజీవితమును నమ్మి దొరకిన యవకాశములను వ్యర్థబుచ్చుచున్నయెడల నిక ప్రాణోత్క్రమణ సమయమందా పరమేశ్వరుని ప్రార్థింపగల్గుట!

వృ. బ్రా—నాయనా! ఇంతటివేదాంత మెవ్వరియొద్ద నభ్యసించితివి

తుకా—మహాత్మా! వచింపజాల నెట్లు నాహృదయమందీ భక్తిబీజము నెలకొల్పబడినదో నాకే దెలియదు.

వృ. బ్రా—అయ్యది నీపూర్వజన్మసుకృతమని దలంతును. కాని ఇంతటి వైరాగ్యసంపన్నుడవయ్యు నీయెద్దులను సామానులను గొనిపోవుచున్నాడవేల?

తుకా—నిక్కముగా నాకు వర్తకము చేయువలయునను తలంపు లేదు. అయినను నాభార్య సంసారయాత్ర చక్కగా నడువనేరదని బలవంతపరచుటచే నియ్యకొని యిట్లరుదెంచితిని.

వృ. బ్రా—అయిన భార్యాబిడ్డలుగలవాడవేగా? ఇంటిసందర్భమున నిరుల్లాలు చక్కని యుపదేశమే యొసంగితిదని వచింపవలయును.

గీ. న్యాయమార్గంబు చేత ధ ♦ నంబుగూర్చి
యాలుబిడ్డలు సుఖమున్న ♦ యవసరమున
చేయవలయు నాధ్యాత్మిక ♦ చింతనంబు
గాని వయసున నిటులుండ ♦ కర్జమగునె.

తుకా—తేమరు జ్ఞానసంపన్నులరు. తమకు దెలియని విషయ మేమి యును యుండదు. అయిన నాచిత్తవృత్తి నెఱుంగగోరి పలుకు చున్నారు. ఆలుబిడ్డ లవసానసమయమున సహాయపడుదురా? అట్టివారి సుఖమునకై యాయుఃకాలమెల్లె వెచ్చించిన నింక విఠోబా సేవ కించుకయైన నవకాశము దొరకదు కాన సుజ్ఞా నియగువాఁడు సంసారము నంటియు నంటక కమ్మలిపుర్వువలె మెలంగుచు భగవదారాధనయం దప్రమత్తుఁడై యుండును

సీ. జాయతో సుతులతో ♦ సంసారముననుండి
సౌఖ్యంబు లొందెడి ♦ ననుయమందు
హృదయ కుహారమున ♦ నెనిలేని వాంఛలు
చెలరేగు నొక్కింత ♦ స్థిరతలేక
అధికభోగంబుల ♦ నాకాంక్ష సేయుచు
తాపత్రయంబున ♦ దవిలియుండు
పరమేశు పదపద్మ ♦ భక్తిలేశము గల్గు
నవకాశమే లేక ♦ నవయుచుండు
కాన సుజ్ఞాని జాగరూ ♦ కత వహించి
యహరిహంబును రామనా ♦ మామృతంబు
తనివిదీరంగ ♦ గ్రోలుచు ♦ దాటరాని
భవమహాబ్ధిని దరియించి ♦ బయటబడును.

వృ. బ్రా—అట్లేయగుసు. కాని యెంతటి జ్ఞానియైనను సంసారమున నున్నతరి యాలుబిడ్డల పోషింపక తప్పదు గదా?

తుకా—తప్పదని యంగీకరింపవలసియున్నది.

వృ. బ్రా—అయిన సూర్యోదయమైన పిమ్మటను యేడెనిమిది గడియ లప్రొద్దెక్కినను బయలుదేరకుండ నిచ్చటెందులకుంటివి?

తుకా—మహాత్మా! ఈప్రశాంతమగు వనమధ్యంబున నుండి రంగని స్మరించుకొనుచుండుటకు సంకల్పించితిని.

వృ. బ్రా — వెఱ్ఱివాఁడా ! నీకై యాలుబిడ్డ లెంతగా నాక్రోశించుకొ యుందు రాలోచింపుము. నీతండ్రి నీభుజస్కంధములపై నిడిన సంసారబాధ్యత నెవ్వరిపై నుంచెదవు లెమ్ము ! మారుమాటాడకుము. నీకు నేను దోడ్పడెదను. ఇంచుమించుగా పూనానగరమువరకు నరుదెంచెదను.

తుకా — మరల సంసారకూపమున ప్రవేశింపవలయునా ?

వృ బ్రా — ఈ ద్వితీయాశ్రమ ధర్మము నిర్వహింపక తృతీయాశ్రమ స్వీకారమా ! అది తగదు లెమ్ము.

తుకా — తమపలుకుల కెదురాడజాలకుంటిని కాని యీవర్తకముపై మాత్రము బుద్ధి చొరబారుటలేదు.

వృ బ్రా — తెచ్చిన సరుకులను విడుదలగావించుకొనుము. పిమ్మటసంగతి యాలోచించుకొనవచ్చును.

[వృద్ధబ్రాహ్మణుఁడు సహాయముచేయగా తుకారాము సరుకులను యెడ్లపై వైచుకొనును.]

[ఇరువురు నిష్క్రమింతురు.]

## ద్వితీయరంగము.

తుకారాముని గృహము.

[జీజీభాయి గృహకృత్యములను సేయుచుండును.]

జీజీ — [ఒకించుక నిలిచి]

గీ. ఎన్నొనెలలయ్యె విభుడేగి ♦ యింతవరకు
కుశలవార్త కేనియు నోచు ♦ కొనగలేదు
మరలిరారైరి మమ్ముల ♦ మరచిరేమొ
నేమిసేయుదు నెట్లు స ♦ హింతు నకట.

తోడనేగిన వర్తకులందరును యిల్లే ప్రివర్తించుచుండిరా ? ఇంటియొద్ద నాదువాం డ్రేమి యిక్కట్లపాలగుదురో యని కొలదిగా ధనమును గూడ బంపుచున్న వినవచ్చినది. నావల్లభుని కామాత్రి మింగితమేల లేకుండపోవలయును. చందువిరొయొద్దనుండి పరిచారకు డరుదెంచి యుండెని దెలియవచ్చుటచే నావల్లభుని సంగతులేమైన దెలియునేమోయని గంపెడాశతో నరిగియుంటిని కానలాభమేమున్నది వారి సంగతియే దనకు దెలియదనినాడు. లాభములేకున్న మాని కుశలముగానైన వారింటికి చేరిన నదియే పదివేలుగా దలంతును.

[ప్రవేశము:—వల్లభదాసు.]

జీజీ—ఏమినాయనా ! అంత తొందరతో నరుదెంచుచుంటివి ?

వల్ల—అన్నగారు వచ్చుచున్నారు. ఈశుభవార్త నీకు ముందుగా దెలుపుటకు పరువుపరువున వచ్చితిని.

జీజీ—నిక్కవమేనా ?

వల్ల—నీతో నబద్దమాడుదునా ? రెండు నిముషము లోపికపట్టుము. అప్పుడేని నామాటలు నమ్మగలవు.

జీజీ—ఆహా ! నేడెంత సుదినము.

[తెరలో] తుకారాము భజన.

వల్ల—అన్నగారదే భజనసేయుచు లోనికి రుదెంచుచున్నారు.

[ప్రవేశము:—తుకారాము భజనసేయుచు]

జీజీ—[ఎదురుగా జని భర్తకు నమస్కరించును]

తుకా—ప్రియా ! జీజీభాయి ఇంటియందెల్ల రాపాండురంగని కటాక్షమున సురక్షితముగా నుండిరిగదా ?

జీజీ—కూర్చుండుడు. ఎట్లో తమరాక నిరీక్షించుచు దినమొక యుగముగా గడుపుచుంటిమి.

తుకా—విదేశములకేగి వర్తకమొనరించువారికి గల్గు యవస్థ లెట్టివో ప్రత్యక్షముగా గనుగొంటిని. ఆకష్టముల మునింగియున్న వేళ లందు రంగని స్మరించుటకుగూడ యవకాశమే లభింపకుండెను.

జీజీ—చందుడు మున్నగువారు సహాయపడలేదా?

వల్ల—వారేగోడవల దగుల్కొనియుండిరో?

తుకా—చందుడు మున్నగువారు తోడ్పడకేమి? మహారణ్యమధ్య మున దివసాంతమున నన్నొంటిగా వదలి తమదారి నేగిరి. ఆరాత్రి కాయటవియందే నిలువవలసివచ్చెను.

జీజీ—ఎంతయో సహాయముజేయుదు మని బాసయొసంగి మిమ్మారీ తిని డించిపోవుటలో వారి యభిప్రాయమేమో?

వల్ల—పెక్కురు వర్తకు లొకయెడనున్న లాభములుగూడ పంచుకొన వలసి వచ్చునని తలంచి యుందురు.

జీజీ—నాథా! ఆయరణ్యమున నెట్లుండగల్గితిరి?

తుకా—పాండురంగని దివ్యనామామృతము గ్రోలుచు యానిశాభాగ మును తృటివోలె గడపివైచితిని. విఠోబా నామకీర్తన మాలిం చినపిమ్మట క్రూరసత్వములు దరికేని రాకుండెను.

జీజీ—కట్టుకథవోలె వినిపించుచుండెని.

తుకా—ఇంతకంటె నత్యద్భుతవిషయ మొక్కటికలదు. నేను పూనా చేరగలుగుటకును, నచిరకాలమున వస్తువుల విక్రయించుట కును, సురక్షితముగా నింటి కరుదెంచుటకును గూడ యాపాం డురంగడే దోడ్పడెను. వృద్ధబ్రాహ్మణుని రూపమున నాతోనున్న యాభగవంతుని గుర్తింపనైతిని.

సీ. అటవిలో నానాడు ♦ హాయిగాగడుపుటం
కెవ్వఁ డనొప్పట వ ♦ శింపనెంచి

భవకలుషవిభంగ భక్తహృత్పదకు సా
రంగ విహంగ తు ♦ రంగయనుచు
సంకీర్తనము సేయ ♦ సంప్రీతివహియించి
కరివరదుండు సా ♦ క్షాత్కరించి
బోధించి నాదగు ♦ బుద్ధిని మరలించి
తనతోడ పునాహౌ ♦ గొనుచునరిగి
హెచ్చుధరకు నరకు విక్రి ♦ యింపజేసి
ప్రారి వెలుపలిదనుక నా ♦ కొరుల వలన
నెగ్గుగల్గనియట్లు ర ♦ క్షించుకొనుచు
నరుగుదెంచి తిరోహితు ♦ డయ్యె నంత.

నేను దిలకించుచుండగనే దిరోహితుడయ్యె నపుడు విభ్రాంతిచే తన్కుండనై గొంతెత్తి యాతనిని పలుమారి కీర్తించితిని. దర్శను మొసంగవలసిన దని ప్రార్థించితిని.

వల్ల—అనంతర మేమి చేసితిరి.

తుకా—విఠోబా యాలయమున కేగి యాతం డొసంగిన రొక్కము నాతని ప్రీతికై సాధువులకు వినియోగపరచితిని.

జీజీ—(తనలో) ఇయ్యది నిక్కమగునా? ఏలకాదనుకొనవలయును. ఏమైననేమి నావల్లభుండు సంపాదించిన ద్రివ్యమంతయు సాధువులకు వినియోగించితి ననుచున్నాడు. ఇంక సంసారమున నెప్పటివలె నగిబాట్లు పడుచుండవలయును గాంబోలును.

తుకా—ప్రియా! ఏమాలోచించుచుంటివి. ఇంతవరకు సంతోషసూచికమైన నీమో మింతలో వివర్ణమైనదేమి?

గీ. ఆత్మకథ నేను విన్పించు ♦ నపుడు నీదు
ముఖవికాసము హెచ్చె బ్ర ♦ మోదరేఖ

లమరియుండెను నుదుట నో • యంబుజాక్షి

ఇంతలో నింత వైవర్ణ్య • మేలకలిగె.

జీజీ—నాథా! తమచెంత నసత్యమాడగలనా ? సంసారపరిస్థితు లన్నియు నెఱింగిన మీరు ధనమంతయు సాధుసత్పురుషులకుఁ గా వించిన నెట్లీ సంసారము కొనసాగునా యని యాలోచించుచున్నాను.

తుకా—ఇదా నీ సంకోచము! ఆదరిద్ర్య మిచ్చినవాఁడు పండరీనాథుఁడు కాఁడా ! అతని ధనమును యాతనికొరకే వినియోగించితిని. ఇందులకు చింతింపనేల ?

వల్ల—అన్నయ్యా ! ప్రస్తుతము సంసారము గడచుమార్గము చూడ నక్కరలేదా ?

తుకా—అన్నిటికిని యాదయాంతరంగుఁడగు రంగఁడేగలఁడు. నీవు ముందుగా లోనికేగి మెల్లను జాగరూకతతో జూడవలసిన దని కాపరికి జెప్పుము. ప్రియా ! జీజీయా పూజాసమయము మతిక్రమించుచున్నది లోనికేగి సర్వమును సిద్ధపరుపుము.

(జీజీభాయి, వల్లభదాసులు నిష్క్రమింతురు.)

తుకా—పండరీనిలయా ! తిరుగ నన్నీసంసారసాగరమున కూలద్రోసితివా ? నిరాటంకముగ నిశ్చలచిత్తమున నిన్నారాధించు టెప్పుడనుగ్రహింతువో గదా ?

సీ. కలుగునా ? నీపాద • కంజాతముల నెప్డు

హృదయాన నిల్పి పూ • జించుఫలము

కలుగునా పండరీ • నిలయుని నిరతంబు

జూడ్కుల కింపుగా • జూచుఫలము

కలుగునా నీదివ్య • కథలను సతతంబు

వీనుల విందుగా • వినెడుఫలము

కలుగునా నీగుణ ♦ గణములు భక్తితో
నెపుడు నోరార కీ ♦ ర్తించుఫలము
కలుగగలదె యీసంసార ♦ జలధిగడచి
హర్షసాగరమున దేలి ♦ యానునట్లు
సతము నిన్నె జపించెడి ♦ సత్ఫలంబు
భక్తహృత్పద్మ సారంగ ♦ పాండురంగ.

[తుకారాము నిష్క్రమించును]

---

# తృ తీ య ర ం గ ము.

స్థలము:—ఒకవీథి.

[ప్రవేశము:—రాముడు, వీరన్న యనువారలు]

రాము—వీరన్నా ! వీరన్నా ! పిలుచుచుండగనే పోవుచుంటివేమి ?

[వీరన్న నిలువబడును]

వీర—ఏమంత తొందరపనియున్నది. కొంచెము జరూరుగా పోవుచుండగా వెనుకకు బిలిచెదవు ?

రాము—పనియుండియే పిలిచితిని.

వీర—ఏమి టా రాచకార్యము ?

రాము—రాచకార్యమున కేమున్నది. నీవెఱుగని సంసారముగనుకనా ఆరోజు కారోజు సంసారంలో ఖర్చేగాని కాని మిగులుట లేదు ఈదినమున నాలుగురూపాయలు కావలసివచ్చినవి సర్దుబాటు చెయ్యగలవేమో అని పిలిచినాను.

వీర—నాలుగు కానులుకూడ చేతిలోలేవు. ఎక్కడేనా దొరుకుతుందేమో అని బయలుదేరేను.

రాము—పోనీ ! రెండురూపాయలైనా ?

వీర—కానీవుంటే కావలసినంత తొందర—

రాము—రేపే తిరిగిచ్చేస్తానులే. ఏరక్షరేగ్గోసమైనా యెవడో ఒకడు రాకపోడు. వచ్చేడా పీడించేస్తాను.

వీర—లేదంటే నమ్మవేం కర్మం. ఇంట్లో బియ్యపుగింజ ల్లేవంటే ఎక్కడేగా అరువు తెస్తానుని బయలుదేరేను.

రాము—నీవుపకారం మరిచిపోను—

వీర—అబ్బా ! చెపితే వినవు— రా నాతోగూడ ! తుకారాము చిల్లర దుకాణము పెట్టెను. అతని నెట్లో మోసగించి పాతికరూపాయలు లాగుకొందము. ఈవిషయంలో నువ్వుకూడా కొంచం సాయంచెయ్యాలి. డబ్బుసర్దుతాను దొరికితే నీకు.

రాము—అందుకు తయారే ! యేపనికీ సిద్ధంకాకపోతే దినంగడవట మెల్లాగ. కాని తుకారాము కోసావర్తకం మానినాడా యేమి ?

వీర—మానివేసి చాలకాలమైంది. మన పాచిక పారడాని కొక్కటే మార్గంవుంది. అతని తమ్ముడు వల్లభదాసు దుకాణంమీద లేకుండావుండాలి. అతనుంటే మాత్రం మనపని సున్న.

రాము—అయితే దుకాణం వల్లభదాసుదా యేమిటి ?

వీర—ఒకళ్లదేమిటి— ఇద్దరూ కలిసేవున్నారు కాదూ.

రాము—సరే పద ఇంకా యిక్కడాలస్యంచెయ్యడ మెందుకు? డబ్బు చేతిలోపడితేగాని మనస్సు నిండుగా వుండదు.

[పరిక్రమింతురు]

---

# తై ర యె త్త బ దు స.

తుకారాము గృహము.

[తుకారాము దుకాణముపైఁ గూర్చుండి యుండును.

తుకా—రంగా ! రంగా ! నాజీవితనాటకము నొంతచిత్రముగా నడపు చున్నాడవు.

గీ. చిత్రభరితముగా నాచ ♦ రిత్ర మీవు
యిచ్చవచ్చినరీతి నా ♦ డించుచుంటి
వహహా ! భావిజీవితకాల ♦ మం దిఁకేమి
చేయ శాసించితో రమా ♦ చిత్తచోర !

వీర—(స్వగతమున) సమయమునకే వచ్చితిని. వల్లభదా సిచ్చట లేడు. ఈసమయమున నీతనిని సులభముగా వంచింప వచ్చును.

రాము—(అపవారించి వీరన్నతో) అనుకూల సమయమునకే వచ్చి నాము. నింక నీతని సమీపింతము రమ్ము.

వీర—(అపవారించి) అవును. రమ్ము కొట్టుపై కేగుదము.

(ఇరువురును దుకాణముపై కేగి కూర్చుందురు)

తుకా—ఏమి వీరన్నా ? ఏమి కావలయును ? క్షేమముగా నుంటివా ?

వీర—ఏమిక్షేమము. మలమల మాడిపోవుచున్నాము. రావలసినబాకీలు రావు; యియ్యవలసినచోట నివ్వక తప్పదు.

తుకా—దేశ కాలపరిస్థితు లిట్లున్నవి.

వీర—మీావర్తకమున నిట్టి లోటుపాట్లుండవు గదా?

తుకా—ఉండకేమి? నేను చిక్కుపడుచుచునే యున్నాను.

వీర—సరి ! సరి! నీవద్ద నేమైన బదులు తీసికొనిపోదమనుకొని వచ్చినాను. వచ్చినందుల కాశాభంగ మైనది. ఇంక వేఱుమార్గ మేమియుఁ దోఁపదు. చందుగారిమమునకున్న అతనినైనను బ్రతిమాలుకొని యుందును.

తుకా—చందు వర్తకమున కేగి యింకను తిరిగి రాలేదు కాఁబోలును.

రాము—చాలా అవసరముగలిగి వచ్చినాఁడు. తిరుగ మీాకు వెంటనే సర్దుబాటు చేయఁగలడు.

వీర—ఒక్క పాతికరూపాయలను సర్దుబాటు చేయుము. నామర్యాద నిలిపినవాఁడ వగుదువు. సర్కారు శిస్తుకై జప్తువారంటు వచ్చినది.

తుకా—అయ్యో! అంతసొమ్ము లేనట్లున్నది. (పెట్టెతెరచి చూచి) ఇదిగో పెట్టెలో ఇరువదిరూపాయలు మాత్రమే వున్నవి. వీనిని గొనిపొమ్ము. కాని త్వరలో తిరిగి యిచ్చివేయుము.

రాము—త్వరలో ననుట యేల? రేపు గాని యెల్లుండి గాని యిచ్చివేయుదును.

వీర—రేపుసాయంకాలమునకు లోపుగా వువ్వులలోఁబెట్టి తీసికొనివచ్చి యిచ్చెదను.

తుకా—మంచిది పోయిరమ్మ.

(రాముఁడు, వీరన్న నిష్క్రమింతురు.)

తుకా—పాపమీాతఁ డెంతటియాపదలకు లోనై యుండెనో కదా! కాసొమ్ము మిగిలిన లెక్క మఱియెచ్చటనైన దొరుకునో లేదో?

ఆతనియక్కఱ సంపూర్తిగాఁ దీర్పఁజాలనైతిని గదా? పరమేశ్వరునికృప యంతే కలదు. నేనేమిచేయుదును...పూజకు వేళ యైనది. వల్లభదాసింకను వచ్చియుండలేదు కారణ మేమైయుండునో కదా? ఆతఁడు రాకుండెనని యాలోచించుచు నిచ్చటఁ గూరుచుండు టెందులకు? దుకాణమును మూసివైచి లోని కరిగెదఁ గాక.

(దుకాణమును మూసివైచి లోని కరుగును)

(తెరవ్రాలును)

ఇది ద్వితీయాంకము.







# భక్తతుకారాము.

## తృతీయాంకము.

### ప్రథమరంగము.

తుకారాము గృహము.

[ప్రవేశము—తుకారాము.]

[తుకారాము పూజాతత్పరుఁడై యుండును.]

తుకా—[హారతిబట్టి] పండరీపురనివాసా! శ్రీనివాసా!

గీ. అఖిలజగములు నీతేజ ♦ మంది వెలుఁగు
అట్టి లోకైకతేజుఁడ ♦ వైన నీకు
దీప మిడుచుంటిఁ గొనుమ నా ♦ పాపహృతికి
పండరీనాథ! భక్తహృ ♦ త్పద్మవాస!

[అని హారతి యొసఁగును.]

నేఁటి పూజావిధానమున నెట్టియంతరాయమును సంభవింపకుండుటచే నెంతయు నాహ్లాదకరముగా నున్నది. ఇందులకే ఋషిపుంగవులు వనాంతరంబుల నేకాంతవాసము సలుపవలయునని శాసించియుండిరి.

(ప్రవేశము—వల్లభదాసు)

వల్లభ—అన్నయ్యా! ఇదేమి వ్యవహారము? ఇంచుకంత యాలస్యముగా నరుదెంచినంతనే దుకాణము కట్టివైచితివా? బాగుగా

నున్నది. ఇట్లయినయెడలవర్తకముజరుగునా ? కాని పెట్టెలో రూపాయలు కాన్పింపవేమి?

తుకా—నీకొఱకు చాలవఱకు కనిపెట్టుకొనియుంటిని. నీవు రాకుండుటచే పూజకు వేళ మించుచున్నదని దుకాణము మూసివైచితిని. ఇంతమాత్రమున వచ్చు నష్టమేమున్నది? ఎవరైన నేసరుకునకైన వచ్చినయెడల నీయవలసినదని నీయొదినగారితోఁ జెప్పియేయుంటిని.

వల్ల—పెట్టెలోఁ రూపాయలు కాన్పింపవేమి? ఇంతలో నేమిఖర్చుపెట్టితివి? ఇంటిలోని కేమియుఁ గొనివచ్చియుండలేదని యొదినగారు జెప్పియుండిరి.

తుకా—ఇరువదరూపాయలుమాత్రమున్నవి. అవి యొక స్నేహితునకు చేబదులుగా నొసఁగియుంటిని.

వల్ల—ఇరువదిరూప్యములు చేబదులా?

తుకా—స్నేహితున కిరువదరూప్యములు చేబదు లొసంగు టొక దోనమా! నిక్కంపుస్నేహితుఁ డాపదలోఁ బడియుండగా చేబదు లొసంగుటయేగాదు. యుచితముగా నొసఁగినను యొసంగవలయును.

వల్ల—నీసిద్ధాంతము నాకు సమ్మతమే గాని మనకుఁగూడ నిరువదిముప్పదిరూప్యములను చేబదులుగాఁ గాని యుచితముగాఁ గాని యొసఁగువా రెవ్వరైన నున్నచో నట్టివారికి సహాయముచేయుటొప్పగును.

తుకా—ఈరాద్ధాంతము లన్నియు నీకెందులకు? రేపు సాయంకాలములోపున తిరుగ మనసొమ్ము మనకువచ్చును. ఇంతలో త్వరపడ నేల?

వల్ల—రేపటిదినమున వచ్చునో రాదో యావిషయ మటుండనిమ్ము.

ఇపుడు నేను గొనివచ్చినసరుకులను వదునైదురూపాయ లీయవ లయును. ఇప్పు డెక్కడనుండి తేఁగలను? ఈయుటున్నయెడల నావర్తకునకు నాయందు విశ్వాస ముండునా?

తుకా—ఇంతమాత్రమునకేనా? పోనిమ్ము. ఎవరినైన చేబదులడిగి సొమ్మిచ్చివేయుము.

వల్ల—ఇప్పుడు నిలుచున్నపాటున మనకు చేబదు లిచ్చువారెవ్వరు;

తుకా—ఇప్పు డంతతొందరజెందుట యేమిలకు? సాయంకాలమునకు సొమ్మిచ్చెదమని యావర్తకునకుఁ జెప్పిరమ్ము. లేదా? యాసరుకులు మరలఁ దీసికొనిపోయి యాతని కిచ్చివేయుము. ఇంతలో మునిఁగిపోవున దేమియును లేదు. [illegible] ఈకఁ దొకింత ముందరు దెంచియున్న [illegible] కము [illegible]

## ద్వితీయరంగము.

(తుకారాము శయనించియుండగా తెర యెత్తఁబడును జీజీభాయి తొందరతో ప్రవేశించును.)

జీజీ—ఏమండీ! ఇవేమి వ్యాపారములండీ! ఎన్నిదినములు సంపాదించిన నిరువదిరూప్యములు దొరకగలవండీ. ఒక్కరోజున నిరువదిరూప్యములు పాదరుఖర్చు చేసిన నెట్లగును? [తుకారాము శయనించియుండుటజూచి] నాయొసర్చిపదంతయు నరణ్యరోదనముగా పరిణమించినది. అపుడే నిద్రించిరి. ఆలోచింపఁగా ... ట కేమియును మార్గము గాన్పింపకున్నది. ... బోధించెదఁగాక.

... )

గ్రహణుఁడు ఈతఁడు తాను తరించుటయేగాక తనతోఁ బె క్కురనుగూడ నాసన్నిధికిఁ దోడ్కొనిరాఁగలఁడు. ఈతఁడు సంసారవిముఖుఁడై యుండుట సహింపక జీజీభాయి పగల మాపల ప్రబోధించుచున్నది. కావున నింకను నీతని కెట్టి కొదువయును గలుగకుండునట్లనుగ్రహించి లోకోపకారార్థమై శ్రుతుల నీతఁడు భాషాంతరీకరణ మొనర్పుటకు నియోగించెదను. (తుకారాము నాశీర్వదించి) భక్తాగ్రగణ్యా! లెమ్ము లెమ్ము. నేఁటి నుండియు నీవు శ్రుతుల భాషాంతరీకరణ మొనర్పుము. అద్దాని వలన నీవును— నీయనుచరులును సులభముగా మోక్షము నొందఁగలరు. (అంతర్హితుఁ డగును.)

[తుకారాము మేల్కాంచును.]

తుకా—పాండురంగా! పోఁబోకుము. రంగా! రంగా!! అనుగ్రహింపవ నరుదెంచి నాయొనర్చు సత్కార్యముల గ్రహింపక అరుగుట పాడియా యియ్యదియేనా! నీభక్తవాత్సల్యము లేక నాయొనర్చిన దోషమేమి?

గీ. అజ్ఞుఁడగుటను నేను మ ♦ హాపరాధ
మాచరించిన మన్నింప ♦ నగునుగాని
యిటుల దర్శనమీక శి ♦ క్షించుటెల్ల
భావ్యమని యెంచినావె నీ ♦ భావమందు.

పరాత్పరా! విఠోబా!! తండ్రి! నీకొఱకై ఎన్నిదినములనుండి— నీదర్శనాపేక్షతో యెన్నివత్సరములనుండి ప్రతీక్షించుచున్నాఁడను. అట్టి నాకు దర్శనమొసఁగరాదనుకొంటివా? ఇదెక్కడి న్యాయము. నిన్ను సమీపింపనెంచకొలది దవ్వులకరుగుచుంటివా? ఇంతమాత్రమె గాక శ్రుతులకు భాషాంతరీకరణ భారమును నాతలపై నిడి- మత్కృతవందనమైన గైకొనక యేఁగి

శివే! నేను శ్రుతులు. గీర్వాణమునుండి భాషాంతరీకరణము నర్పగా నీవె నన్నింతగలుగు యోగించితివా? మహానుభావా! ఇయ్యది నాకసాధ్యమైనదిగా దోచుచున్నది. నీయాజ్ఞలను తిరస్కరింపజాలను. మరల నొక్కసారి దర్శనమొసంగి యీదీనజను ననుగ్రహింపుము.

(ప్రవేశము—జీజీభాయి.)

తుకా—(జీజీభాయిని గాంచి) ప్రియా! పండరీనాథుం డిచ్చటి కరుదెంచినాఁడు నేను సత్కరింపు దలంపున లేచుచుండ నెట్లో యరిగినాఁడు. నీకుఁగూడ నమ్మహాత్ముఁడు దర్శన మొసంగి యుండెనా?

జీజీ—(స్వగతమున) వెఱ్ఱికుదిరినది రోకలి తలకుఁజుట్టుమనిన ట్లున్నది వీరిభక్తి. యంతకంత కిన్నాళ్ళనముగా పరిణమించుచున్నది.

తుకా—ఏమీ! నీ కాపాండురంగఁడు గాన్పింపనే లేదా?

జీజీ—ఇచ్చటి కెవ్వరైన వచ్చినగదా గాన్పించుటకు. ఇపుడే నేనిచ్చటి కరుదెంచి తాము నిద్రించుచు టిరని యావలికేగియుంటిని. ఇంతలో తమమాటలు వినబడినంతనే మేల్కాంచియుందురని యిట్లరుదెంచియుంటిని. ఇంతలో నొకరు మనయింటి కరుదెంచుట కవకాశమెక్కడున్నది. ఊరక భ్రాంతినంచుచుండిరి.

తుకా—వెఱ్ఱిదానా! భ్రాంతినందుచుంటినా? కట్టెదుట నిలచి ఓయీ! నీకు నేటి తుకారామన్న పేరు దగియున్నట్లుగాన్పించును. కావున నేటినుండియు భక్తతుకారాము నామమును వహించి గీర్వాణమునందున్న శ్రుతులను భాషాంతరీకరణ మొనర్పవలసినదని యాజ్ఞాపించియున్నాఁడు.

జీజీ—మీ రెప్పుడును నదే ధ్యానమున నుండుటచే రంగడు మీకు సా క్షాత్కరించినట్లు భావించియుందురు. అంతియే గాని మనగృహం బున కెవ్వరును వచ్చియుండలేదు.

తుకా—నీవు నాపల్కుల విశ్వసింపకున్న మాత్రమున నాకు లోటు గలుగదు. నేటినుండియె తత్కార్యసాధనమున కుపక్రమిం చెదను.

జీజీ—మీరు శ్రుతులను మహారాష్ట్రభాషలో వ్రాయ సంకల్పించి రయ్యది మీకు సాధ్యమా?

తుకా—నే నెవ్వడను. భాషాంతరీకరణము గావించుటకు సర్వమున కా పండరీనిలయుడే కర్త. నే నూరక నిమిత్తమాత్రుడను. ఇంక సం దేహించు టెందులకు?

జీజీ—మీ యిచ్చవచ్చిన ట్లాదరింపుఁడు. కాని తమతో వితండవాద ములు సలుపుటకు నే నిట్లరుదెంచియుండలేను.

తుకా—నీవు వచ్చినపనియేమి?

జీజీ—ఏమిపనున్నది. కొత్తకోమటి సంసారము బాగుపడనున్న మన సనారమే నాటికైన బాగుపడగలదా? ఇంటియందలి పరిస్థితు లెట్లున్నవో తమకు దెలియుట లేనట్లున్నది?

సీ. ఆకలిబాధచే ♦ నన్నంబునకు బిడ్డ
లేవేళ నొకరీతి ♦ నేడ్చుచుండ
మారు వస్త్రములేక ♦ మానంబుగాపాడు
కొను టెట్లనుచు నే ♦ గుందుచుండ
పూట బత్తెములేక ♦ పొరుగిండ్ల కప్పున
కై యనవరత మే ♦ నరుగుచుండ
గంజినీళ్లకునైన ♦ గతిలేక నుపవాస
భరమున పరితాప ♦ పడుచునుండ

ఎట్లు సంసారసాగర ♦ మీాదివచ్చు
ననుచు పనదినంబునను నే ♦ నడలుచుండ
ఇంత నిశ్చింతగా మీార ♦ లే విధాన
నుండగల్గిరొ మదిని దోప ♦ కుండె నకట.

ఇట్టి పరిస్థితులట్లుండగా నెవ్వరో స్నేహితులకు జేబదులుగా నిరువది రూప్యము లొసగిరా? ఇంట నున్నది-తయూ నూడ్చి పెట్టిన యాలుబిడ్డలమగు మేమే మగుదుమని భావించితిరి. సంసారమునకు సంపదు నాదాయ మున్నయెడల పురుషుఁ డెన్ని పోకల బోయినను బోవచ్చును. గాని లేమిగలవాఁడు ద్రవ్యార్జన సేయక కాలయాపన సేయుచున్న సంసారము కడతేరునా?

తుకా—వెఱ్ఱిదానా! ఈతాపత్రయంబులు మన కెప్పుడును నున్నవే. మేనప్రాణము లుండగనే భగవత్సేవ జేసికొని పరంబునుగూర్చి చింతింపవలయును. ఇంకొక్క పరమార్థ మెఱింగించెద నాలింపుము.

గీ. జగము సృష్టింపఁ బోషింప ♦ సమయజేయు
శక్తియుతుడైన రంగని ♦ సాత్త్వికముసను
నిల్పి పూజించు భక్తుల ♦ కల్పక బు
విలన పోషింపబడినట్లు ♦ వరలుచుండుర్రి.

జీజీ—మాటలాడుటకు వచ్చినప్పుడెల్ల నేదో వేదాంతపు ముక్కలను వచించి నోరు మెదలకుండజేసి పంపుచుందురు.

తుకా—కాదు కాదు. నీవు నాహృదయంగతాభిప్రాయమును గుర్తింపజాలకున్నావు. నిశ్చింతతో నుండు మనస్సుగలవారి కెన్నడును నెట్టి యిక్కట్లు రావు. రాజాలవు. ఈసూక్ష్మవిషయమునే గ్రహింపజాలకున్నావు.

జీజీ—(కోపముతో) ఈ సంసారమున నిశ్చింతతో నుండు భాగ్యమే నాటికైనా గల్గిన నదియే పదివేలు. ఇంక మీతో నేను వాదింపంజాలను. (నిష్క్రమించును.)

తుకా—ఇంకను కాలవిళంబన మెనర్పనేల? భగవదాజ్ఞ పరిపాలింపవలయు సాధనముల సమకూర్చుకొని యెదగాక.

(నిష్క్రమించును.)

---

# తృతీయరంగము.

స్థలము—ఒక వీధి యరుగు

(మూనాజీ, సోమన్న, రామశాస్త్రి, సుబ్బావధానులు, మున్నగువారు కూర్చుండియుండగా తెర యెత్తబడును.)

మూనా—రామశాస్త్రీ! ఇదెక్కడిగోల వచ్చినదోయి. నాకూటిలో మన్ను గొట్టుటకీ తుకారాము డెక్కడ దాపురించినాడు. పది దినములనుండి ఒట్టున కొక్కడైన రాకుండెను.

సోమ—మన శిష్యవర్గంలోవాళ్ళు కూడా తుకారాము భజనలో చేరి పోతున్నారు. రండర్రా అని పిలిస్తే ముఖం మాడ్పైపుకు తిప్పుకొని ఇంక నిక్కడికి రాదలుచుకోలేదని స్పష్టంగా చెప్పేరు.

సుబ్బా—ఇంకో క్రొత్త విశేషంకూడావుంది. తుకారాము సంస్కృతములో నుండి శ్రుతులను మహారాష్ట్రభాషలోనికి తర్జుమా చేస్తున్నాడట. ఆకారణంచేత కూడా చాలామంది అతనివద్దకే చేరుకుంటున్నారు.

మూనా—ఇలా యింకో పదిరోజులు గడచిందంటే జ్ఞానవతిరి కూడా

కరవొచ్చేటట్లున్నది. త్వరగా దీని కేదో మార్గాంతరం ఆలోచించుకోవాలి.

రామ—తుకారాముని యిక్కడి కీడ్చుకొని వస్తే

సోమ—అది సీతరవహూతుందా?

సుబ్బా—ఏదో వంకమీద లాక్కరావచ్చునులే.

మాన్వా—వస్తేమాత్రం ప్రయోజనమేమున్నది.

రామ—మాకిపకారం చేస్తున్నావని రహాస్యంగా మందలిద్దాము.

సోమ—మందలింపులు పనికివసాయటోయీ!

సుబ్బా—బాగా తాళాధ్యాయాలు కావాలి గాని మాటలతో ప్రయోజనం యేముంటుంది.

సోమ—దెబ్బలాటకు దిగినయెడల నలుగురు మనదే తప్పని అంటారు.

మాన్వా—అందుకు తగినంత కారణం వుండాలి.

రామ—మనకిం తపకారం చేస్తూవుంటె వేరే యింకోకారణం వుండాలాయేమిట?

సోమ—పిలిచి, దాసరీ నీకన్ను లొట్టయేనట్లుగా క్కడి కీడ్చుకొని వచ్చి నీవు చేసేపని తప్పని చీవాట్లు పెట్టిస్తే కోపంతెచ్చుకొని బూతులకు ప్రారంభిస్తాడు. అది మిషగాపెట్టుకొని దాళాధ్యాయాలు కాసస్తే సరి— అప్పుడు మన్నెవ్వరూ యేమీ అనరు.

మాన్వా—ఆమాట ఆలోచిద్దాం కాని- ఇవాళ నాల్గు డబ్బులేనా దొరికేసూత్రం వన్నాలి. నువ్వు వెళ్లిన పనేమైంది రామశాస్త్రి అముసలిపీను గేమన్నాడు.

రామ—వాణ్ని బుట్టలో పడేశాను. కాని డబ్బుకోసం శోధముకొనుచున్నాడని తెలిసింది.

సుబ్బా—నన్ను చేబదు లిమ్మన్నాడు. నేను తుకారాము నడిగితే లెక్క దొరుకుతుందన్నాను.

మాస్వా—సొంపకుం చేసేవు తుకారాముఇన్న వెళ్లేవంటే మన నోట్లో మన్ను పడిందన్నమాటే ఇంక మళ్లా నాకు మనదగ్గఱ కొస్తాడనుకున్నావా యేమిటి ?

సుబ్బా—నాకేం జేస్తాను. నేనెంత పురెక్కించానో మీరు తెలియును.

రామ—ఎక్కడ తిరిగినా మనదెంతను రాకపోదు. మూలవిగ్రహానికే పురెక్కించేను. నేనెలా ఆడిస్తే అలా ఆడుతుంది. ఇంకలోటే మున్నది.

మాస్వా—(సంచిలోలున్న కొంచెము కాగితములు తీసి నలుపును) ఇఖ రయినది. జ్ఞానపత్రికి తమముబాముకోవలసి వచ్చింది. సోమన్నా! నీప్రయత్న మెల్లాగుంది.

సోమ—ప్రయత్నలోపం లేదు. కాని యింకా పానిక పారేటట్లు కన పడ్డంలేదు. ఆలోకించిన వాటికి అర్థమొస్తోంది.

రామ—దానికూడా ఒక్కమోతాదిస్తే సరి.

మాస్వా—రేపుమీయింటివద్ద కుంకుమపూజ యేర్పాటు చెయ్యి. దాన్ని పూజదగ్గరికి లాక్కొచ్చేవా నాతడాఖా చూపిస్తాను. బోడినానికూడా వెర్రెత్తించేస్తాను.

సుబ్బా—ఈమార్గం అవలంబిస్తే చక్కగా చేప వలలో పడితీరుతుంది.

(ప్రవేశము:—వెంకన్న.)

మాస్వా—ఏమివెంకన్నా తొందరగా వచ్చేవు.

వెంక—ఏముంది తుకారాముగారి ఆవు దొడ్లోపడి తోటంతా నాశ నంచేసింది. దాన్ని పట్టుకోడానికి నానా అవస్థా పడ్డాము పట్టుకట్టేసి మీతో సంగతంతా సెప్పాలని వచ్చేను.

మాస్వా—అనుకున్నట్లుగా అవకాశం దొరికింది. శాస్త్రీ నువ్వూ వెం కన్నా వెళ్లి తుకారాముని లాక్కరండి.

[వెంకన్న, రామశాస్త్రి నిష్క్రమింతురు.]

సుబ్బా—అవుని వాఁడిలాయ్యకూడదు. దీనికూడా శాస్తి చెయ్యాలి.

మాస్వా—వాఁడిలిప్పోలని శాస్త్రవుందా యేమిటి? చచ్చేటట్లు చితకొట్టి వాఁమలుదాము.

సోమ—అవుగదా! చంపడంఅట్టే ధర్మంగా వుండదేమో నని ఆలోచన.

మాస్వా—చంపడమెందుకు? మళ్లీ లేవకుండా చేస్తే సరి.

(ప్రవేశము:—వెంకన్న)

మాస్వా—ఏమి తుకారాము వస్తున్నాడా?

వెంక—వస్తున్నాడు. ఈసంగతి చెప్పడానికి ముందుగా వచ్చేను.

మాస్వా—మళ్లీ చెప్పడానికి వచ్చేనా? పద పద మీాయిద్దరు కలసి చక్కగా దేహశుద్ధిచేసి చక్కారాక వెళ్లి నీకోపమంతా తీర్చుకో. ఈలోపల అవునంగతి మేంస్వయంగా కనుక్కుంటాము.

[అందరు నిష్క్రమింతురు]

---

## తు రీ య రం గ ము.

## తు కా రా ము గృ హ ము

(ప్రవేశము:—జీజీభాయి.)

జీజీ—(నిర్వేదమున)

గీ. గోవధము సేయు టదియొక ♦ ఘోరంపాప
మనెడు హైందవు లిటు ల ♦ న్యాయముగను
నోరెఱుఁగని యట్టి ధే ♦ నవును బట్టి
హింస సేయఁగ నెట్లు లూ ♦ హించినారో

కటకటా ! నోరెఱుఁగని పశువు తప్పి వారినిట్టి తమకొట్టిలోని కరుదెంచినదని దానిఁబట్టి కట్టి కొట్టి మొగులకును బంకిరాన్ని గా చిక్కఁబెట్టుట యేమిన్యాయము? తాము జననాయకులంటే. జనులందరకును నీతు లుపదేశింపవలసినయట్టివారే! ఈవిధం బున లోకవిరుద్ధంబుగ వర్తించుచున్నయెడల సామాన్యుల విష యము ప్రశ్నింపనేల? మాయింట మేము పశియుండి కలియో గంజియో దాని కాలమును గడపుకొనుచుండఁగా తిను కేను పరాధము చేసితిమని మాపై కార్పణ్య మూనవలయును? మాపైఁగల క్రోధము నోరెఱుఁగని పసువుపైఁజూపు టేమి న్యాయము? పసిబిడ్డలకైన యధేచ్ఛగా పాలొసఁగుచున్నదని సంతసించుచున్న నాసంతోష మంతయునుగూడ నసుగంటినది. (ఆలోచన నభినయించి) ఇదేమి? చూచిరావలసినదని పంపిన వల్లభదాసింకను రాకుండుటచేత మన మూరక యాందోళనప డుచున్నది.. వీరైన నింటికింకను జేరుకొనకుండుటచే నాయాం దోళన మినుమడించుచున్నది. వల్లభదాసైన నింటికిఁజేరుకొని న కొంతవరకు ధైర్యముగా నుండునుగదా? (ముందునకుఁ జూచి) అదిగో ! దూరమున నేదో ధ్వజసమూహము గాఁబో లును యిట్లరుదెంచుచున్నది. (బాగుగా పరికించి] అదిగో నాథుఁడత్యుల్లాసమున భజనపరులతో నీవంకకే యరుదెంచు చున్నారు త్వరలోనే యింటికి రాఁగలరు. వీరు సురక్షితులై యింటి కరుదెంచి రదియే పదివేలు.

(ప్రవేశము:—వల్లభదాసు)

జీజీ—ఏమోయి! అదేపోకగాఁ బోయినావు. చూచిరమ్మనినందులకే యింతటి యాలస్యము గాంచితివా?

వల్ల—నాదోషము లేదు.

జీజీ—అనగా—అక్కడి వృత్తాంత మేమి?

వల్ల—నే నేగునంతకు అన్నగారు స్మృతివిహీనులై పడియున్నారు. వారిని విడచివచ్చుటకు వీలు లేకపోయినది.

జీజీ—వారినిగూడ బాధించిరా?

వల్ల—తల్లీ! దుర్మార్గులు చేయరాని పనులుండునా?

గీ. పశువులను బట్టి బాధింప ♦ బాలుపడెడి
ఘోరదుర్మార్గులగు చేయఁ ♦ గూడనట్టి
కార్య మొక్కటి కలదె జ ♦ గాన నెందుఁ?
బట్టివారికె కలుగు జ ♦ యంబు నేఁడు.

పరమదుర్మార్గులకే నేఁడు జయము లభించుచున్నది.

జీజీ—ఇప్పుడు వారు భజన సేయుచు వచ్చుచున్నట్లున్నారే! ఇంతలో వారి కెట్లు స్మృతికలిగినది?

వల్ల—నేను వారిని సమీపించి విచారించుచుంటిని. ఇంతలో నిదుర నుండి మేల్కాంచినట్లుగా లేచిరి. 'అంతి నేను శరీరమునం దెట్లు న్నదని ప్రశ్నించితిని అన్నగారు లేచి నిలువఁబడి వల్లభా! రంగడు మనసక్షమున నుండఁ గొదవ కలుగునా? లెమ్ము. రంగని గీర్తించుచుఁ బోవుదమని వచించిరి. మేము రెండడు గులు నడచితిమో లేదో పెద్ద పసమూహము మమ్ముఁ జు ట్టుకొనినది. అతికష్టముమీఁద నాసమూహమునుండి తప్పించు కొని తమరు నాకొఱకు కనిపెట్టుకొని యుందురని వచ్చుట కీవేళయైనది.

జీజీ—వారి నట్లు బాధించినవా రెవ్వరు?

వల్ల—ఎవ్వరో కాదు. మాస్వామీజీస్వాములవారి శిష్యవర్గమే అంతటి మహాత్కార్య మాచరించినారు.

జీజీ—ఆపుసంగతి యేమైనది? అయ్యది లేవఁగలస్థితిలో నున్నదా?

వల్ల—ఈసందడిలో నాసంగతియే మఱచితిని. అన్నగారు సురక్షితముగా నరుదెంచుచున్నారు కాన నిఁక నేనేగి గోవునుగూడఁ జూచివచ్చెదను.

(ప్రవేశము:—తుకారాము.)

జీజీ—నాథా! సురక్షితులై యరుదెంచిరా! ఆదుర్మార్గులకు తమరు గావించిన యెగ్గేమికలదు.

తుకా—వారియెడ నేను గావించిన యపరాధ మేమో యాపాండురంగనికే తెలియవలయును.

ఉ. పండరినాథుపాదములఁ ♦ బాయనిభక్తి జపించుకొంచు నే
నుండుట యెల్లవారలకు ♦ నోరిమితోడ సుబోధకంబుగా
నుండెను భక్తిమార్గముల ♦ నొక్కటఁ జెప్పుటఁజూచి యీనులో
నుండి విరోధ మూని నను ♦ నొంపఁ దలంచి రటంచు నెంచెదన్.

అంతకంటె నాయెనర్చిన నేర మేమియును గానుపింపదు.

జీజీ—ఇప్పటికైన నాదుండగీడులకు బుద్ధి కలుగవచ్చును.

తుకా—పండరినాథు ననుగ్రహంబున వారు సన్మార్గు లగుదురనియే తలంతును.

జీజీ—గోవునుగూడ నాదుర్మార్గులు బాధించిరి. వల్లభదాసు నద్దానిని గొని వచ్చుటకుఁ బంపనెంచుచుండఁగా నింతలో మీరే యరుదెంచిరి.

తుకా—అది యీపాటికే శాలలోని కరుదెంచియున్నది. దానికై మీరు శ్రమపడవలసిన పనిలేదు.

జీజీ—నిక్కమేనా? దానిని లేవఁజాలనట్లుగాఁ గొట్టియుండిరని వినియుంటినే.

తుకా—అవును. వారు దానిని గూడ బాధించినమాట వాస్తవమే. కాని పాండురంగడే యద్దానిని సంరక్షించి మనయింటికిఁ బంపించి యున్నాఁడు.

గీ. సందియంబేని మీరు గో ♦ శాల కరిగి
కాంచి రండిఁకఁ గన్నుల ♦ కరవు దీర;
భక్తజనులను రక్షించు ♦ పాండురంగ
వరదుఁడే దానిఁ గాపాడి ♦ పంపినాడు.

వల్ల—నిక్కమమేనా? నామది సంశయము వీడకున్నది. నేనేగి యాగోవును దిలకించి వత్తును.

జీజీ — నాకును యద్దానిని జూడవలయునని లేదా? నేనుగూడ నరుదెంచెదనుండుము.

తుకా—రండు—నేనుగూడ లోని కరుదెంచెదను.

(ముగ్గురును నిష్క్రమింతురు.)

ఇది తృతీయాంకము.





# భక్తతుకారాము.

## చతుర్థాంకము.

### ప్రథమరంగము.

### మాస్వాజీ మఠము.

[మాస్వాజీ, రామశాస్త్రి కూర్చుండియుండగా తెర యెత్తఁబడును]

మాస్వా—రామశాస్త్రీ! దీనితో తుకారామునకు తొల్లింటిగలభక్తి నశించును.

రామ—ఆదెబ్బల కాగిలేక నాగోవు విలవిలఁ దన్నుకొనుచు నేలఁగూలినది. ఇంక నది యేఘడియకో ప్రాణములు విడుచును.

మాస్వా—తొలుత గోవును చంపకూడదనుకొంటిని గాని తుకారాముపై నున్నకోపము రవ్వంత యినుమడించుటచే నంతగాఁ గొట్టియుంటిని. నీవు చెప్పినట్లుగా నది యింక జీవించుట కల్ల

రామ—అవకాశము దొరికినది గదా యని తుకారాము నిగూఢ మన వార లల్లే సత్కరించియుందురు.

మాస్వా—దెబ్బలతో నాతడు చావకున్నను యేపదిపదిహేనుదినములలో మంచముపై నుండి దిగఁజాలఁడు.

రామ—స్మృతిలేకుండ నాతడు శవమువలెఁ బడియుండుట నేను చూచియుంటిని. అప్పు డొతనితమ్ముఁడు కన్నుల నీరుబెట్టుకొని విచారించుచున్నాఁడు.

మాస్వా—అయితే ఈదెబ్బతో పీడ వదలిపోవునేమో!

[ప్రవేశము:—వెంకన్న]

మాస్వా—ఏమి వెంకన్నా ! వల్లభదాసు తుకారాము నింటికి జేర్చి నాడా ! విశేషము లేమి ?

వెంక—కావలసినన్ని విశేషములు లున్నవి.

మాస్వా—ఏమవి ?

వెంక—తుకారాము సురక్షితముగా లేచినాడా ?

మాస్వా—ఆ ! ఆ ! సురక్షితముగా లేచినాడూ ?

వెంక—అగును.

రామ—నాచేతిపోటులఁ దిన్నవాడు మరల లేచుట కల్ల.

వెంక—నిద్రపోయి లేచినవానివలె లేచినాడు—

మాస్వా—నిజమేనా ?

వెంక—అవును. లేచినతోడనే భజన సేయుటకు ప్రారంభించెను.

రామ—వింతగానున్నది.

వెంక—నాకును ఆశ్చర్యముగానే యున్నది.

మాస్వా—నిద్రపోయి లేచినవానివలె లేచినాడా ?

వెంక—అవును. లేచి భజనసేయుటకు ప్రారంభించెను. రెండునిముష ములలో పెద్ద భజనసమూహము మూగినది ఈవింత యేమో చూడవలయునని నేనుగూడ వెంబడించితిని.

మాస్వా—నీవుగూడ వారివెంట సరిగితివా ? పిమ్మట నేమిజరిగినది ?

వెంక—తుకారాము గృహమునకుఁ జేరుసంతకు నాతని యావుగూడ సురక్షితముగా నింటి కరుదెంచినది. ఆవింత తిలకించి మిగుల నాశ్చర్యమును బొంది మీకీవర్తమానము జెప్పవలయునని వచ్చితిని.

మాస్వా—అవుకూడ సురక్షితముగా నింటికిఁ జేరినదా? విచిత్రము గా నున్నదే?- రామశాస్త్రీ! తుకారాముఁ జావమోది వచ్చువఱకును గోవును బాధించుచునే యుంటిమి. ఇంతలో నది మెల్లు లేవగలిగినది.

వెంక—అదేమో! మాయగా నున్నది.

మాస్వా—శాస్త్రీ! నీవేగి యింకను దూడ వచ్చుట పడియున్నదో లేదో చూచిరమ్ము అంతవఱకు నాసందేహము తీరదు.

(రామశాస్త్రి నిష్క్రమించును.)

వెంక—స్వామీ! ఇంక నాదొక విన్నపము.

మాస్వా—ఏమది?

వెంక—నాకు సెలవు దయచేయవలయును.

మాస్వా—ఎక్కడికి పోయెదవు?

వెంక—ఎక్కడికో పోయెదను. కాని నేఁటికి భక్తిప్రభావము యెటు వంటిదో తెలిసికొనఁగలిగితిని.

మాస్వా—అయిన నీవుగూడ తుకారామునకు శిష్యుఁడ వగుటకే నిశ్చ యించుకొంటివా?

వెంక—ఒకరికి శిష్యత్వము సంబంధ మేమిటికి? ఏపండరీపురమునకో పోయి పాండురంగసంకీర్తనము గావించుకొనుచు కాలక్షేపము సేయుచుందును.

మాస్వా—వెఱ్ఱివాఁడా! అక్కడనున్న భగవంతుఁ డిక్కడ లేఁడా! ఆహరినామకీర్తనమేమో యిక్కడఁ జేసికొనరాదా?

వెంక—ఏమో! నాకు పండరీపురమునకుఁ బోవలయునని యున్నది. నేఁడే ప్రయాణ మగుచున్నాను.

మాస్వా—సరే నీయిష్టము. మఱలివచ్చుట యున్నయెడలఁ గాన్పించె దవు గదా? ఎప్పుడు బయలుదేఱుదువు?

వెంక—ఎప్పుడో నా ? ఇదే బయలుదేరి పోవుచున్నాను. ఆశీర్వదించి పంపఁ బ్రార్థించుచున్నాను.

మానాజీ—శుభ మగుఁగాక ! పోయి రమ్ము. త్వరలోననే కలసి కొందము.

వెంక—చిత్తము. (నిష్క్రమించును.)

మానాజీ—అకటా ! మత్యంతభయభక్తులతో మెలఁగుచు నాకు మేలోనఁగూర్పఁదలంచువారిలో నొక్కఁడని తలంచుచున్న యీ వెంకన్నకుఁగూడ నాయెడఁగల భక్తి నశించినది. తుకారాము నకు మేముకావించిన యపరాధమే యీతని చిత్తవృత్తి మార్చియుండును. అట్లు తలంపవలసి వచ్చుచున్నది అయ్యదియే నిక్కమైనయెడల తుకారాముని గోవుకూడ సురక్షితముగ నిల్లు చేరియుండునని యే తోఁచుచున్నది. ఇయ్యది నిక్కమగునా ? విషయవిమర్శన మాచరించుట కేగిన రామశాస్త్రి యాలస్య ము సేయుటఁగూడ వింతగా నున్నది. మరమునకు వెనుక కేగి రావలయునని పాపుఁడొకఁడైనకూడ నక్కఱలేదు. అట్టియెడ నీతఁ డేల యాలస్యము చేయుచుండెనో తెలియుటలేదు.

(ప్రవేశము:—రామశాస్త్రి)

మానా—అదిగో తలంచునంతలో నతఁడే వచ్చుచున్నాఁడు. ఏమి శాస్త్రీ ! ఆలస్యము చేసితివి ?

శాస్త్రి—ఆవు పడియుండవలసినస్థలమున కేఁగితిని కాని యావు చచ్చుట లేదు. ఏమైయుండునా యని ఆలోచించుచు డెక్కలగుర్తుల నంబట్టి కొంతదూరము పోయి వచ్చితిని. ఆవు సురక్షితముగా వెంకన్న చెప్పినట్లుగా నింటి కేగియుండును.

మానాజీ—నిజమేనా? ఎముకలు విఱుగఁటచే నేలఁగూలిన యావు

లేచి నడువఁగలిగినా? మహారోగ్యముగా నున్నది. నీవు తుకారాముని యింటికేగ కనుగొని రమ్ము.

శాస్త్రి—అక్కడకుఁగూడఁ బోవు టెందులకు?

మాస్వా—ఇందలి నిజానిజము లరయుటకు గాదా?

శాస్త్రి—అరయుట కేమున్నది? వెంకన్న చెప్పినది నిజమే అక్కడ కూర్చొని చూస్తున్న యొకస్నేహితుఁడు చెప్పినాడు. మనం వెనక్కి తిరగడంతోటే ఆవు లేచి వెళ్ళిపోయిందట.

మాస్వా—అయితే మన ప్రయత్నాలన్నీ మంటఁ గలిసినట్లే

శాస్త్రి—అలాగే అనుకోవాలి.

మాస్వా—ఇంక తుకారాముని లొంగదీసే మార్గాలు లేవా యేమి?

శాస్త్రి—ఉన్నాయి కాని కాస్త గమ్మత్తు చెయ్యాలి.

మాస్వా—ఏదో త్వరగా చూచుకోవాలి కాని యుపేక్షింపరాదు.

శాస్త్రి—అది రహస్యవిషయం. జాగ్రత్తగా పథకం ఆలోచించి రేపటి యుదయం విశదంచేస్తాను.

మాస్వా—అలాగే కానీ? ఇంతలో తొందరేమున్నది. పొద్దుపోయింది పూజ కానిద్దాము లోపలికిరా.

(ఇరువురును నిష్క్రమింతురు.)

తెర వ్రాలును.

———

## ద్వితీయరంగము.



### ౧ వ వీధి.

(తుకారాము భజనసమూహముతో భజన చేసికొనుచు ప్రవేశించును)

యమునాకళ్యాణి—ఏకతాళము.

రంగనామసుధారసమును మీరలు
ముదముతోడ గ్రోలుడీ
దారాసుతులను వ్యామోహమునఁ బడి
సంసారసాగరమున సమయకుడీ॥ రంగ॥
పాపభంజనుని పతితపావనుని
పరమభక్తితోఁ దలపండీ॥ రంగ॥

తుకా—పరమభక్తులారా! ఇంక నాకు సెలవిండు. రంగని సేవసేయుట కేనరుగవలసియున్నది వలయునెడల తామునూడ నరుదెంచి పూజావైభవమును కనులారఁ దిలకించి యానందింపుడు. రండు. ఇంక జాగుసేయుటకు వలనుపడదు.

1 భక్త—ఇంతకంటె మాకుఁ గావలసిన దేమియున్నది.

2 భక్త—మహాత్మా! నాదొక్క విన్నపము. మనము భజనసేయుచు నీవిధంబుననే పండరీపురంబున కరిగి విఠోబాను సందర్శించి సేవింపవలయునని కుతూహలము జనించుచున్నది ఇందులకుఁ దయ రనుగ్రహింపవలయును.

తుకా—యావన్మందిభక్తులు ఒంటరిగ కేగుదమనుచుండ వలదని వారించుచున్నటి మూఢుఁడనా? కాని పండరీశుని యానతి కైకొనరాదవలసివచ్చునని మాత్రము సంకోచించుచున్నాను.

1 భక్త—అయిన యింతలో పండరియాత్ర సేయుభాగ్యము మాకుఁ గలుగదా?

తుకా—నేఁడు భాషాంతరీకరించుచున్న శ్రుతులను సంపూర్తి గావించిన పిమ్మట పండరినాథుని చెంతకేగి నాగ్రంథము నాతని కర్పింపఁదలంచితిని.

2 భక్త—అట్లు కావింపవచ్చును ఇంతలో మించిపోవున దేమున్నది.

[తుకారాము గృహమును సమీపించుచుండగా వెంకన్న యరుదెంచి, తుకారాము పాదములపై వ్రాలును]

వెంక—మహాత్మా! అనుగ్రహింపవలయును. తాము రక్షించితి నను నంతవరకు తమ పాదపద్మములను విడువ దలంపలేదు.

తుకా—సోదరా! నానిగ్రహానుగ్రహములతో నీకు నిమిత్తమేమున్నది లెమ్ము. నిశ్చలభక్తితో పండరీనాథు నాశ్రయింపుము.

చ. నిరతము తమ్ముఁ గొల్చెడి మ ♦ నీషుల బ్రోచెను కంకణంబు దా
కరమునదాల్చినట్టి నవ ♦ కంజదళాక్షుని రంగనాథునిన్
తిరముగు బ్రాపుగాదలచి ♦ తేఁకువమీఱ నుతింపుమైనచో
నరుదగు మోక్షసంపదల ♦ నందగలాడ వటంచు నమ్ముమీ.

నిత్యనిర్మలస్వరూపుఁడును, శాశ్వతానందసంధాతయు నగు పరమేశ్వరుని పాదపద్మముల నాశ్రయింపుము. అతఁడే నిన్ననుగ్రహింపఁగలఁడు.

వెంక—అట్లుకాదు. నేను మూఢుఁడను. యుక్తాయుక్తవిమర్శనజ్ఞానహీనుండనై తమయెడ మహాపరాధ మాచరించియుంటిని. అనుగ్రహింపవలయును.

చ. కుమతులుసేయు బోధనల ♦ కిన్ జెవియొగ్గితి, దుర్మదాంధ చి
త్తమునను బట్టి గొట్టితిని ♦ తాము మహాత్ములు గాన నాదు పా

పములఁ క్షమించి మీాను పద ♦ పద్మములన్ భజి పనిచ్చి ప్రేమ
మమున ననుగ్రహింపగను ♦ మానుగ వేడెద తాఁ సోత్తమా.

తుకా—సోదరా! ఇఁకను భ్రాంతి నినువదలియుండలేను. నేనును నీవలెనే సామాన్యమానవుఁడను. నిన్ను రక్షించుటకు దగిన సామర్థ్యము గలవాఁడనా ? నీవు నన్ను బాధించితివనియ కొట్టితి వనియు చింతిపకుము. నీ వారంగని యాదేశములేకుండ నే కార్య మొనర్పగలవు. సర్వమున కారణుఁడే కారణుఁడు. ఆ తఁడే నీచే నన్ను దండింపజేసినాఁడు. ఆత డే భక్తుఁడ నగు నన్ను రక్షించుకొనినాఁడు. ఇందు నీవు నిమిత్తమాత్రుఁడవైతివి. ఇంతమాత్రమునకు చింతింపనేల? ఇఁటియుగాక పాపమునకు పశ్చాత్తాపమే ప్రాయశ్చిత్తము. కావున లెమ్ము. పండరీనాథుని సేవింపుము.

వెంక—మహాత్మా ! నామనశ్శాంతికొరకైన నన్నుక్షమించితి నని పలుకుఁడు.

తుకా—అనుజా ! నీమనశ్శాంతికొరకైన క్షమించితిని లెమ్ము. కాని పండరీనాథుని సేవించుట మానకుము. ఇదియే నీకు నేనుఁ గావించు మహోపదేశము.

వెంక—అనుగ్రహింపబడితిని.

తుకా—పండరీనాథునిచే ననుగ్రహింపబడితివి. పండరీఁలయుని పూజింతము రమ్ము.

వెంక—మహాత్మా ! మాస్వామీజీ తమయెడ విరోధమూ తమ్మెట్లయినను సాధింపవలయునని యత్నించుచున్నాఁడు.

తుకా—నాయనా ! ఎంతవెఱ్ఱివాఁడవు. ఒకఁడొకనిని బాధించునా? బాధింపఁగలఁడా ? అతఁడు తలంచిన నాదేహామునకు మాత్రమే

యపకారము సేయఁగలఁడు గాని యాత్మను బాధింపఁజాలఁడు గదా! అందుచే నాతనిఁగూర్చి భయపడవలసిన పనిలేదు.

వెంక — అయిన నాతనిఁగూర్చి కొంచెము జాగ్రత వహింపవలయును. వైశ్యకులస్థులైన తమరు శ్రుతులను భాషాంతరీకరణ మొనర్చుచున్నారని యాతఁడు మిగుల క్రోధమూనియున్నాఁడు.

తుకా — అంతమాత్రమున నాపైఁ గోపింపవలసిన యగత్య మాతనికి లేదు. ఆతఁడు నాపైఁ గోపించుటకుఁ గల కారణ మేమో నీకుఁ దేటతెల్లముగా నెఱింగించెద నాలింపుము.

సీ. తనశిష్యకోటిలో ♦ దనరెడి వారెల్ల
భక్తిమార్గంబును ♦ బట్టుకతన
తనయార్జనమునకు ♦ దగు మార్గములు, గూడ
యరికట్టబడినవై ♦ యాలరుకతన
తనమాట మాళ్లిపై ♦ ననయంబు దాల్చెడి
వారెల్ల పెడదారిఁ ♦ బట్టుకతన
తనయందు నేగూడ ♦ నెనరుంచి తిఱుగక
యొంటిమై చరియించు ♦ చున్నకతన
వైశ్యకులమున నేను సం♦భవమునొంది
అంత్యజులకు సుబోధక ♦ మగు విధాన
శ్రుతుల రచియించుచున్నట్టి ♦ కతన నతఁడు
నన్ను ద్వేషించుచుండు న ♦ నారతంబు.

ఈవిషయములన్నియు నేనెఱుంగుదును. ఒకరి నిగ్రహానుగ్రహములతో నాకెంతమాత్రమును నిమిత్తములేదు. నిందాస్తుతులకేను వెఱువను. రంగడు శ్రుతులను భాషాంతరీకరణ మొనర్పవలసినదని శాసించియున్నాఁడు. ఆతని యాజ్ఞానుసారముగ నేను వానిని రచించుచుంటిని. ఒకరు నను హింసింపఁజూచినంత

మాత్రమున రంగనియాజ్ఞ తిరస్కరింతునా? ఆతని యిచ్ఛ వచ్చినరీతి బాధింపనిమ్ము.

1 భక్తు—అతఁడొక్కఁడు తలఁచినంతమాత్రమున వీరి నేమి సేయఁగలడు. ఈయూరఁగల పెద్దపెద్ద లాతనిచర్యల గర్హింపరా?

2 భక్తు—వీరి కిపకారము గావించిన నింక నాతఁడుమాత్ర మీయూర నివసింపఁగలఁడునా?

3 భక్తు—అతఁ డట్టిప్రయత్నములో నున్నాడన్నచో నాతని నాయింటినుండి విషము పమాత్రమున సాగనంపుదును.

1 భక్తు—అతఁ డున్న గృహము నామిత్రునిదే! రేపే యాతనిని సాగనంపుదును.

తుకా—సోదరులారా! మీ రేవిధముగను యాతని కెగ్గుసేయుటకు యత్నింపకుఁడు. అతఁడే తనచిత్తవృత్తిని మార్చుకొని పండరీనిలయునకు భక్తుఁ డగును.

గీ. ద్వేషభావంబు మది నుద్భ ♦ వించుకతన
నతఁడు నా కెగ్గు సేయఁగ ♦ నరయుచుండె;
చిత్తసంశుద్ధి గల్గిన ♦ తత్తరమున
నతఁడె రంగని సేవింప ♦ నరుగుదెంచు.

మీరెవ్వ రాతనిని యాతనిప్రయత్నములనుండి విముఖుని గావించుటకు యత్నింపకుఁడు. అతఁడు రంగనియందుఁగల భక్తిప్రభావ మెట్టిదో యరయుటకు యత్నించుచున్నాడు. నిక్కముగను గనఁగోఁజాలినప్పు డతఁడే రంగని సేవించును. ఇంక పూజాదికముల నొనర్ప నే నరిగెదను సెలవిండు.

(తుకారాము గానము సేయుచు నిష్క్రమించును)

తెర వ్రాలును.

## తృతీయరంగము.

### మూస్వాజీ మఠము.

[మూస్వాజీ, సుబ్బావధానులు, రామశాస్త్రి, సోమన్న మున్నగు శిష్యవర్గమును, మఱికొందఱు పండితులును గూర్చుండి యుందురు. తెర యెత్తఁబడును]

మూస్వా — ఈవిషయము నాకుఁ గొలఁదిదినములక్రిందటనే తెలియవచ్చెను అప్పటినుండియు నామది తామరపాకులోనినీటిబిందువువలె తల్లడించుచునే యున్నది.

1 పండి — ఈవిషయ మాలోచింపవలసినదే

శాస్త్రి — ఇందువలన నెన్నియనర్థము లుత్పన్నము లగునో ముఖ్యముగా మన మాలోచింపవలయును.

2 పండి — కాకా ? ఇఁక బ్రాహ్మణులైన మనపలుకు లాకర్ణించువాఁ డెవ్వఁడుండును.

1 పండి — కులగౌరవము లన్నియు కూలఁబడుననుట కేమియును సందేహము లేదు.

మూస్వా — ఇట్టివిషయములం దుపేక్షవహించుట న్యాయము కాదను తలంపుతో తమవంటి పెద్దల కీవిషయమును తెలియఁబఱచితిని. ఇటుపైన తమచిత్తము.

సుబ్బా — చేయవలసిన కర్తవ్యమునుగూర్చి యాలోచింపవలయును.

సోమ — ఆతని నీప్రయత్నమునుండి విముఖుని గావింపవలెను.

శాస్త్రి — మాబోంట్లు మీకు సలహా నొసంగఁదగువార మగుదుమా ! ఎట్లు కావించిన మనకును, దేశమునకును, అగ్రవర్ణజులకును యశోగౌరవము రాఁగలుగునో యట్లే కావింపుఁడు.

1 వం—హితవచనములతో నాతని మందలించిచూచిన బాగుండు నని తలంచుచున్నాను.

2 వండి—అబ్బో! యాతని యున్మాదము మేరమీరి యున్నది. నీహితవచనములను లెక్క సేయునంతటివాఁడు గాఁడు.

మాస్వా—తమవంటివారు చెప్పిన నోలానోకవేళ విను నేమోకాని యింకొక్కవిశేష మున్నది?

1 వండి—ఏమది?

మాస్వా—అతఁ డీవఱకే చాల గ్రంథమును రచించియుండెను ఇపుడాతఁడు మీపల్కు లాకర్ణించి మిగిలినభాగమును పూర్తిగా విడచు నను మన కెగ్గుసేయుటకు రచింపఁబడిన భాగమే చాలు ననుకొందును.

1 వండి—అగునగును.

2 వండి—అతని నంగీకరింపఁజేసి గ్రంథమునంతటినిగూడ నాశనము గావింపవలయును.

శాస్త్రి—అగునగును. అట్లు కావించిన నాడుగాని కులమర్యాదలు నిలువఁబోవు.

1 వండి—ఏదోయొకనెపమున గ్రంథమును మున్ముందుగాఁ జేఁజిక్కించుకొని రూపుమాపవచ్చును.

మాస్వా—సామాన్యముగా నాతఁడు గ్రంథమును గొనితెచ్చి మీకర్పించునా? అందునను యాతఁడు పండరీనాథునకు గాన్కఁగా నొసఁగుపఱ కెవ్వరికిని యద్దానిని జూపకుండ నుండవలయునని నిశ్చయించుకొనినాఁడు.

1 పండి—అట్లయిన నాకు నమ్మికయైన గ్రంథమును జేజిక్కించు కొందుము.

మూస్వా—(స్వగతముగ) వీరికి తుకారామునిపై ననూయ కలుగునట్లు గావించితిని. అసూయాపరు లేకార్యమైన నొనర్పఁగలరు. (ప్రకాశముగా) తమచిత్తము. మీకు సహాయము కావలయునన్నచో మాయవధానులు మున్నగువారు తమవెంట రాఁగలరు.

2 పండి—నలుగురైదుగు రున్నయెడల మంచిదే యగును.

1 పండి—ఇంకను యిక్కడ జాలము సేయుటేల? లెండు. తుకారాము చెంత కేగి వత్తము.

(మూస్వాజీయును, రామశాస్త్రియును దక్క నన్యు లందఱును నిష్క్రమింతురు.)

శాస్త్రి—గురోజీ! చూచితిరా? ఎట్టిపన్నుగడ పన్నితినో! మనము తటస్థముగా నుండవలయును వచ్చెడు నిందలన్నియు నితరులు భరింపవలయును. ఇందులకై గతరాత్రియం దెంతయో యాలోచించి యుంటిని.

మూస్వా—కాని యీవిషయముఁగూడ మనకు జయము కలుగదనియే తోఁచుచున్నది.

శాస్త్రి—ఏల?

మూస్వా—ఆతఁడు తనగ్రంథమును వీరి కొసంగడనియే విశ్వసింతును.

శాస్త్రి—వీరు సామాన్యులు కారు కార్యసాధనమునకుఁ గడఁగినచో సాధించువఱకు నిద్రాహారములఁగూడ సరకుగొనకుండ యత్నింతురు. తమ కింతయనుమాన మెందులకు? మనముగూడ వారి వెనువెంట నేగి యేమిజరుగుచున్నదో యరయుదము రండు.

మాన్వ్—ఇచ్చటఁ గూరుచున్నచో నాందోళన మధికమగుచున్నది. రమ్ము పోవుదము. కాని తుకారాముని గృహమునకు మాత్రము రాజాలను.

శాస్త్రి—ఆతనియింటి కేగుటకుఁ బని యేమున్నది? సమీపమున నెందో కూర్చుండి జరిగెడి విషయము లన్నింటిని పరికించు చుందము.

(ఇరువురును నిష్క్రమింతురు)

తెరవ్రాలును.

---

## తురీయరంగము.

---

తుకారాముని మందిరము.

(తుకారాము ఆరాధన సేయుట చాలించి భక్తుల కుపన్యసించు చుండును.)

తుకా—ఈసంసారసాగరమునుండి గడచుటకు పండరీనాథుని నిరంతరము సేవించుటయె కర్తవ్యము. కలియుగమున మోక్షము నందుటకుఁ గల మార్గము లన్నిటియందునను భక్తిమార్గమే యత్యుత్తమమైనది. పరిశుద్ధాంతఃకరణంబున దినంబున కొకసారియైన విఠోబాను స్మరించుటమే ప్రథమకర్తవ్యముగా నెన్నఁదగును. రంగనాథుఁడు భక్తజనరక్షణమునం దేమరక యుండును. తన్నచలభక్తి నారాధించుభక్తులు దన్నేవేళ పిలుతురో యని తలంచి నిరీక్షించుచుండును. కావున.

సీ. రంగని పదపద్మ ♦ రాజీవములభక్తి
నేవేళలందు సే ♦ వింపవలయు,

వీనుదోయికి ♦ విందుగా నెల్లవేళల
రంగనామంబె వి♦నంగవలయు.
చేతులారంగ నా ♦ శ్రీరంగధాముని
సేవల నిరతంబు ♦ సేయవలయు,
రంగనాయకుని కీ ♦ ర్తనల నోరారంగ
బాడి తన్మయతను ♦ బడయవలయు,
జన్మములనెల్ల నుత్తమ ♦ జన్మ మెత్తి
యందులకు మోక్షసామ్రాజ్య ♦ మందుకొఱకు
ననుదినంబును దగురీతి ♦ యత్నములను
చిత్తసంశుద్ధితోఁ దాను ♦ సేయవలయు.

సంసారమును సాగరముతో సాధారణముగాఁ బోల్చుటలోఁ గల యభిప్రాయమును విశదీకరించుతు నాలింపుము. భార్యకును సముద్రమందలి జలమునకును, కష్టసుఖములకును, తరంగములకును, పుత్రపుత్రికలకును సముద్రమందలి జలచరంబులకును యుపమానము లగును. కాంతావ్యామోహమునఁ బడినవాఁడును నడిసముద్రమునఁ బడినవాఁడును బ్రతికి బయటఁబడుట యసాధ్య మగును. కావున సంసారసాగరమునుండి తరించుటకు భక్తియే సర్వోత్తమమైన సాధనము. భక్తిమార్గమున సాధింపరాని కార్యములు లేవు.

[ప్రవేశము :—పండితులు.]

తుకా—పండితవర్యులకు సుస్వాగతము. తమ రాకచే నాగృహము పవిత్రమైనది.

వెంక—(తనలో) మాస్వామి శిష్యవర్గముతో నరుదెంచుటచే వీరుగూడ నాతనితోఁ గలసి తుకారాముని వంచింపనెంచియే యరుదెంది యుందురని తలంతును.

తుకా—అయ్యా! కూరుచుండుడు. వెంకన్నా! వారు మహానుభావులు. మనకు నేడు వీరిదర్శనము లభించుటచే ధన్యులమైతిమి. వీరు నాచే రచింపఁబడిన శ్రుతులను గాంచవలయునని యరుదెంచియున్నారు. ఆగ్రంథసంపుటములను గొనివచ్చి వీరికిమ్ము.

వెంక—(సంకోచించుచుండును.)

తుకా—సంకోచింపకుము, వారు పండితులు. మనకృతియందుఁగల దోషముల విమర్శింప సమర్థులు.

1 పండి—(తనలో) ఈతఁడు తన గ్రంథమును శ్రీరంగనికిగాక యన్యులకు జూపడని మానాజీ జెప్పియుండెనే. అందులకు విరుద్ధముగా నీతఁడు తనగ్రంథమును మాకు జూపుమనుచున్నాఁడే.

2 పండి—(తనలో) గ్రంథము మున్ముందుగాఁ జేతికి లభించును గదా! యిటుపైన నేమిచేయవలయునో యాలోచింపవచ్చును.

సోమ—(తనలో) ఏమీతని యపూర్వతేజము. ఈతని గాంచినంతటనే యీపాండురంగని దర్శించినంత యానందము గలుగుచున్నదే.

వెంక—(గ్రంథమును గొనివచ్చి పండితుల కందించును.)

2 పండి—తుకారామ్! నీ వీ గ్రంథమును రచించుటలో గల నీయభిప్రాయమేమి?

తుకా—శ్రుతుల భాషాంతరీకరణము సేయ నేర్పుగాని యందులకు దగిన పాండిత్యముగాని లేనివాఁడను. అయినను పండరీనిలయుఁడీకార్యభారమును నాతలపైనిడెను. ఆతని యాజ్ఞానుసారముగ రచించియున్నాఁడను. ఇట్టియెడ నీయభిప్రాయ మేమని ప్రశ్నింప నేమని ప్రత్యుత్తరమొసఁగవలయునో దోఁచుటలేదు.

1 పండి—ఈగ్రంథమువలన ప్రయోజన మేమని తలంతువు?

తుకా—శ్రుతుల యర్థమును సామాన్యులుగూడ సులభముగా గ్రహింపగలరు. అకారణమున భక్తిమార్గమును జను లనుసరించి మోక్షమును సాధింపనేర్తును.

గీ. నిత్యమై సత్యమగుచును ♦ నెగడునట్టి
నంత తానంద సామ్రాజ్య ♦ సంపదలను
గలుగజేసెకి భక్తిమా ♦ ర్గంబు బట్టి
యెల్లరును భవవార్ధి ద ♦ రింపగలరు.

2 పండి—శ్రుతులను జనువు నధికార మీావర కెవ్వరియుందుగలదో నెఱుంగియుందువని తలంతును.

తుకా—చదువనేర్చినవారలు శ్రుతుల జనువుటకుం దగినవారు.

1 పండి—కాదు కాదు. అగ్రవర్ణులు మాత్రమే వానిని జనువుటకుం దగినవారు.

2 పండి—అట్టియెడ శ్రుతుల జనువుటకైన ననర్హుడవైన నీవు దానిని సుబోధకమగునట్లుగా మహారాష్ట్రభాషలో రచించుట కనర్హుడవని వేరుగా వచింపవలయునా? ఇందుల కేమని యుత్తరు వొసంగగలవు.

తుకా—మహానుభావులారా! తమతో వాదమును సలుపంజాలను. గ్రంథమును మీాచేతుల నుంచితిని. చదివి యది లోకమున కుపకరించునని దోచినపక్షమున లోకమున విస్తరింపజేయుండు లేదా మీాయిచ్చవచ్చినట్లు గావింపుడు.

సోమ—(తనలో) గ్రంథము నొసంగుటకు నీతం డొక్కడుగా వాదించునని మేమెల్లర మఱుదెంచి యుంటిమి గాని మాదారాశ వ్యర్థమైనది.

1 పండి—మంచిది. మేమీగ్రంథమును సమగ్రముగా జదివిచూచి మరల వంపెదము.

వెంక—వలదు వలదు. ఇక్కడనే యాగ్రంథమును జదువుకొనుడు. (తుకారామునితో) మహానుభావా? వీరు మోసమున గ్రంథమును సంగ్రహించుకొని పోదలంచిరి. వీరికి గ్రంథమొసంగి పంపు టనర్థమునకు మూలమగును.

తుకా—వెంకన్నా! మరేమియు భయములేదు. స్థిరచిత్తుడవై యుండుము. మహానుభావులారా! తమ యిచ్చ వచ్చినట్లుగా వింపుడు.

1 పండి—ఇంక మేమరుగుచుంటిమి.

తుకా—చిత్తము.

(పండితులు సుబ్బావధానులు నిష్క్రమింతురు.)

సోమ—(తనలో) వీనితో నేగుటకన్న నిచ్చటనుండి రంగని పూజానిధానమంతయును దిలకించుచుండెదను.

వెంక—మహాత్మా! వీరీ గ్రంథమును మరల తమకప్పగింతురా? అట్టి యుద్దేశము వీరికున్నట్లు గన్పింపదు.

తుకా—నీయభిప్రాయమేమి?

వెంక—వీరాగ్రంథమును నశింపజేయుదురు.

తుకా—కానిమ్ము. ఇంతమాత్రమున మనకు నష్టమేమి ? వీరా మాన్పాజిచే యిందులకు ప్రబోధితులై యరుదెంచినవారలని యెఱుంగుదును. వీరి యభిప్రాయమును గూడ గుర్తించియుంటిని.

వెంక—అయినయెడల గ్రంథమును వారికేల యొసంగియున్నారు.

తుకా—రంగనాథుడాగ్రంథమును నాచే వ్రాయించెను. ఆగ్రంథము జగంబున నుండు టాతనికి సమ్మతమైన నాతండే యాగ్రంథము

మున్నరింపఁగలను. ఆశని కయ్యాది యిష్టముగాకున్న యెడల కయ్యాది నశించును. అందులకై మనము విచారించినందువలన ప్రయోజన మేమున్నది. మఱియు నొక్కవిశేషముగూడ దెల్పెద నాలింపుము. ఈగ్రంథము వీరు గొనిపోవుటవలన వీరికి చిత్తసంశుద్ధి చేకూరఁగలదు. అక్కారణమున వీరుగూడ భక్తిప్రభావమును గుర్తించి పండరీవిలయుని సేవింతురు.

(ప్రవేశము:—రామశాస్త్రి గ్రంథముతో)

తుకా—ఏమి శాస్త్రిగారూ! మాన్వాజీగారు కుశలమా! నన్ను దమ చెంతకు రావలసినదిగా వర్తమాన మంపియుండలేదు గదా!

శాస్త్రి—లేదు. తమకీగ్రంథము నొసఁగుమనిరి.

వెంక—ఈగ్రంథము వారికెట్లు లభించెను. మాచెంతనుండి పండితులు గదా గొనిపోయిరి.

శాస్త్రి—ఆపండితు లిద్దానిని నదిలో పారవైచి యరిగిరి. మాగురువర్యు లిద్దానిని సంగ్రహించి దమచెంత కంపినారు. ఇంక నాకు సెలవిండు పోయివచ్చెదను.

(రామశాస్త్రి నిష్క్రమించును)

సోమ—(తనలో) ఆశ్చర్యముగా నున్నది. తుకారాముడన్న మండిపడు స్వభావముగల మాన్వాజీ తన చేజిక్కిన గ్రంథమును దహించును గాని తిరుగ నీతనిచెంతకు బంపునా? ఇందేమో చిత్ర మున్నది. మాన్వాజీ మతమునకేన సర్వమును దెలియ గలదు.

(నిష్క్రమించును)

తుకా— వెంకన్నా, చూచితివా? గ్రంథము తిరుగ మాచెంత కరుదెంచినది. నేను జరుగనున్న విచిత్రమగు విషయమొక్కటి దెల్పెద నాలింపుము. నేటి సాయంకాలములోపున మాన్వాజీ నాదర్శనమున కరుదెంచును. భక్తశిఖామణి యగును. ఇంక లెమ్ము. సాయనుష్ఠానమునకు వేళ యతిక్రమించుచున్నది.

(అందఱును నిష్క్రమింతురు)

తెరపడును.

ఇది చతుర్థాంకము.

---







# భక్తతుకారాము.



## పంచమాంకము.

### ప్రథమరంగము.

మాస్వాజీ మఠము.

(మాస్వాజీ, పండితులు, రామశాస్త్రి, సుబ్బావధానులు మున్నగువా రుండఁగా తెర లేచును.)

మాస్వా—మీ రడుగగానే యాతఁడు గ్రంథ మిచ్చుట కష్టముగను చిత్రముగా నున్నది.

1 పండి—నేనును యీవిషయమును గూర్చి వింతనొందితిని.

2 పండి—గ్రంథము మాచేఁ బడినందుకే యాతని నిందింపఁ దలఁచితిమి.

సుబ్బా—గ్రంథముయొక్క నామరూపము లైనఁ గన్పింపకుండుటకే నదిలో నూరద్రొక్కితిమి.

మాస్వా—మీతో నరుదెంచిన సోమన్న యింకను రాలేదేమి?

సుబ్బా—అచ్చట నింకేమైన విశేషములు జరుగునేమో గమనింపవలసిన దని చెప్పియుంటిని. అతఁడును యీపాటికి వచ్చుచునే యుండును.

మాన్వా — సోమన్నా ! ఇంకను నిక్కచ మరయువలయునందు వేమి ? ఈకేం దుదయమునుండియు నిచ్చటనే యున్నాఁడు.

సోమ — కానిండు. నేను నావిధాయకకృత్యమును గావించియుంటిని. నమ్మిన నమ్ముఁడు లేకున్నను నాకుఁగలుగు నష్ట మేమియును లేదు. ఇక నాకు సెలవిండు. పోయి వచ్చెదను.

(సోమన్న నిష్క్రమించును)

మాన్వా — ఇదేమి కథుంగను వింతగా నున్నదే ! మనముకూడ నొక్క సారి యచ్చటి కేగివత్తమా?

1 పండి — మాకును యుక్తముగానే యున్నది. ఒక్కసారిపోయి వచ్చినందువలనఁ గలుగు నష్ట మేమున్నది ? రండు పోవుదము.

(అందఱును నిష్క్రమింతురు)

---

## ద్వితీయరంగము.

(తుకారాముని మందిరము)

[తుకారాము భజన సేయుచుండును.]

మోహాన — ఏకతాళము.

ఏమనున్నావురా రంగా — నన్నేల వేమిరా ॥
కరుణించఁగ రావేరా నన్ — కాపాడరా శ్రీరంగా ।
ఏమిటి కింపుల రావు — మొఱ విన వేమిరా రంగా ।
పతితపావననామా నన్ — పాలింపరా మోహనా ॥ఏమ॥

(తుకారాము భజన సేయుచుండును. మాన్వాజీ మున్నగువారు ప్రవేశింతురు )

మాన్వా — [తనలో] నిశ్చయముగా నీతఁడు తన్మయుఁడై భజన సేయుచుండఁగా జూచినవారిదే జన్మము.

1 పండి—చిరకాలము నుండితాము రచియించుచున్న గ్రంథమును బలాత్కారమునఁ గొనిపోయితిమన్న విచారలేశమేనిలేక యెంత నిశ్చలచిత్తమున భజన సేయుచున్నాఁడు?

వెంక—(ఆశ్చర్యమున) మహాత్మా! తాము వచించినరీతి మామాస్వామి మున్నగువారు చేసియుండిరి.

తుకా—(స్మృతితెచ్చుకొని) మహాత్ములారా రండు కూర్చుండుఁడు.

మామా—తమరు రామశాస్త్రి గ్రంథమునుదెచ్చి యర్పించియుండెరా?

తుకా—అవును, రామశాస్త్రియే దెచ్చియుండెను. మీరా గ్రంథమును దిలకింపనెంతురా? చూడుఁ డిదే యాగ్రంథము.

1 పండి—(పరికించి) అద్భుతము! ఆశ్చర్యము!! కని విని యెఱుఁగము. నదిలో మూఁడుదినములు మునిఁగిన యీగ్రంథము మరల నెట్లు వెలికరుదెంచెను.

మామా—రామశాస్త్రి యుదయమునుండి యిప్పటివఱకు నన్నొడఁబాయకుండెను! అతఁడు మీకు గ్రంథము నెట్లొసఁగెను.

తుకా—ఇందుఁగల విశేషమెఱిఁగింతు నాలింపుఁడు.

ఉ ఎవ్వని పాదపద్మములె • యేడ్తెఱ యంచుఁ దలంచుచుందునో
యెవ్వని నామకీర్తనము • నేమరకే నొనరించుచుందునో
యెవ్వఁడు రక్షకుండనుచు • నెంతయు సంస్మరియించుచుందునో
యావిభుఁడైన రంగఁడు స్వ • యంబుగఁ దెచ్చెను గ్రంథరాజమున్.

ఆరంగనాథుఁడు తనయాజ్ఞచే రచింపఁబడిన గ్రంథము నశించుట కిష్టములేనివాఁడై స్వయముగఁ దెచ్చి నాకొసంగెను?

మామా—ఇది సత్యమా! నమ్ముటకు నవకాశము లేదే.

తుకా—నాపల్కుల విశ్వసింపకున్న మామాని— సీవ డితవర్యులతోఁ బంపిన సోమన్న నడిగిచూడుఁడు. ఇంకను నమ్మకున్న నేనొన

రింపఁగల దెద్దియును లేదు. కాని నీకొక్క విషయమును దెల్పెద నాలింపుము.

గీ. తన్ను నిరతంబు హృదయమునఁ ♦ దలఁచు చుండు
భక్తునకుఁ గట్టుబట్టయు ♦ పడలఁ బాపి
రక్షణము సేయఁగా నిలిచి ♦ రంగఁ డెపుడు
వేచియుండు నటంచు భా ♦ వింపుమయ్య.

కలియుగంబున జపతపంబులు కఠినతరనియమబద్ధము లైనకతన లోకులు తరింప పరాత్పరుండగు రంగనాథుఁడు భక్తిమార్గ మును బోధించి తన్నామములన మోక్షము నొందుఁడని శాసించి యున్నాడు.

మాన్వ—(తుకారాముని పాదములపై వ్రాలి) మహాత్మా! అనుగ్ర హింపవలయును. భక్తిమార్గమును బోధింపవలయును.

తుకా—సోదరా! మాన్వజీ! విజ్ఞాన సంపన్నుఁడ వయ్యు నిట్లు పలుకుట వింతగానున్నది. (లేవఁదీసి) ఆరింగనాథుని పదముల నాశ్రయింపుము. భక్తిమార్గము నుపదేశించుట కేమున్నది? రంగని నామసంకీర్తనము గావింపుము. ఇంతకంటె నితరమగు నుపదేశ మేమియును లేదు. రంగనామసంకీర్తనము సేయుటచే నెందఱెందఱో తరించి యుండిరి; తరించుచున్నారలు; తరింపఁ గలరు. శ్రీపాండురంగని నామసంకీర్తనమున కంటె మోక్ష సాధనము వేఱొకటి యుండఁబోదు.

సీ. పాపవల్లిని రూపు ♦ మాపు శ్రీరంగని
సంకీర్తనమునకు ♦ సాటి గలదె?
మాయాంబుధిని దాఁట ♦ జేయు శ్రీరంగని
సంకీర్తనమునకు ♦ సాటి గలదె?

సకల జాడ్యంబుల ♦ సమయించు రంగని
సంకీర్తనమునకు ♦ సాటి గలదె?
పావన పదల సొం ♦ పగు శ్రీరంగని
సంకీర్తనమునకు ♦ సాటి గలదె?

గీ అట్టి శ్రీపాండురంగ నా ♦ మామృతంబు
గ్రోలు జనులకు సౌఖ్యంబు ♦ కొఱంతవడునె?
మోక్షసామ్రాజ్యసిద్ధి క ♦ మోఘసాధ
నంబు రంగనినామ మె ♦ న్నంగ వినుము.

నాపలుకులు యథార్థము లగునో కావో యని సందేహించు చుంటివి కాన నింకను గొన్ని దినములు పరిశీలింపుము.

మాన్వా — చిత్తము నేటికి సెలవిండు పోయి వచ్చెదను.

తుకా — మంచిది.

(మానాజీ మున్నగువారు నిష్క్రమింతురు)

తుకా — వెంకన్నా! నీసంశయము తీరిందా?

వెంక — మహాత్ముల ప్రభావము మూఢులకు గోచరించునా? క్షమింప వలయును.

తుకా — క్షమించుట కేమున్నది? కాలవారణమేల? భక్తులారా! భజన సేయుటకు మరల ప్రారంభింతమా?

వెంక — చిత్తము.

(తుకారాము వెనుకటి పాటను బాడుచుండును. శిష్యు లనుస రింతురు. అప్పుడు ఛత్రపతిశివాజీలోని కరుదెంచును.)

శివా — (తుకారాముని పరికించి) ఏమీ! యీతనియందొక యపూర్వతేజ మక్షిగోచర మగుచున్నది. ఇట్టి మహనీయుని దర్శన లాభంబున నేడు కడుంగడు ధన్యుండనైతిని. (సమీపించెద గాక! సమీపించి నమస్కరించును.)

తుకా—పండరీశుని యనుగ్రహమును బడయుదువుగాక. వత్సా! కూరుచుండుము. నాయనా! ప్రతిష్ఠానగరమును విడచి యొంటిపాటున నిల్లేల చనుదెంచితివి? నీభుజస్కంధములపై నున్న కార్య మెంతవిలువయైనదో వచింప వీలగునా? అట్టినీవు ఒంటరిగా నిట్లరుదెంచితివా? నీమనంబున నిట్టిసంకల్పము గలదని యెఱిగి నేనే రావలయునని తలంచుచుంటిని. ఇంతలో నీవే యరుదెంచితివి.

శివా—మహాత్మా! తమ్ము సందర్శించి ధన్యుండను కాఁగోరి యిట్లరుదెంచితిని.

తుకా—గతమునుగూర్చి చింతించుట తగదు. నాయనా వచ్చినందులకు సార్థకముగా పండరీనాథుని సేవించి చరితార్థుండ వగుము.

[తుకారాముమున్నగువారు భజన సేయుచుందురు.
తెరలో కలకలము]

తుకా—(భజన సేయుట చాలించి) వెంకన్నా! యీకలకలమునకుఁ గారణ మేమో కనుఁగొని రమ్ము.

(వెంకన్న నిష్క్రమించి వెంటనే మరల ప్రవేశించును.)

వెంక—స్వామీ! షామషావారి సైన్యముకావలయును. యింటికి నలువంకల బారులుతీర్చి యున్నారు.

తుకా—ఔరంగజేబుషామషాసైన్యమా! మహారాజా! చూచితివా? షామషాసైన్యము నిన్నెట్లు వెంబడించుచున్నదో! కానిమ్ము. వెంకన్నా! భజన కంతరాయము కలుగకూడదు. ఇట్టిసైన్యములు పది వచ్చినను మనల నేమియుఁ జేయఁజాలవు.

(భజన సేయుచుందురు. కలకలము తగ్గిపోవును)

తెర వ్రాలును.

## తృతీయరంగము.

---

(తుకారాము, శివాజీ, వెంకన్న, మఱికొందఱు భక్తులు యుచితాసనములపైఁ గూర్చుండి యుండఁగా తెర యెత్తఁబడును.)

శివా—మహాత్మా! తమచెంత నెన్నిదినములున్నను సంతృప్తి కలుగకున్నది.

తుకా—కాదు. అట్లు పలుకకుము. నీరాకఁ గోరి తానాజీమున్నగువారు పరితపించుచుందురు. అందునను భవన్మాతయగు జీజీభాయి యెక్కుడుగ విచారించుచుండును. మఱియు మహారాష్ట్రరాజ్యసంస్థాపనకార్య మింకను గాలేదు. కావున యా కార్యమును జక్కఁబెట్టుటకు నీవు సత్వరముగా నేగవలయును.

శివా—నేను నిమిత్తమాత్రుఁడను. తమ యాశీఃప్రభావముననే సర్వమును నెఱవేఱఁగలదు.

తుకా—మంచిది పోయి రమ్మా నీకు శుభ మగుఁగాక! త్వరలో రాయగడముగూడ సాధింపఁగలవు. స్వధర్మసంస్థాపనార్థమై యుద్ధమును ప్రాణమును తృణప్రాయముగ నర్పింప సంసిద్ధుఁడవై యున్న నిన్నా పండరీనాథుఁ డనూనకటాక్షమున రక్షింపఁగలఁడు.

శివా—చిత్తము. (నమస్కరించి నిష్క్రమించును.)

తుకా—వెంకన్నా! విఠోబానామసంకీర్తనమువలన కలుగఁజాలని సంపద్విశేషము లుండఁబోవు. నిరంతరము దగని నామసంకీర్తనము గావించువారికి మోక్షము కరతలామలక మగును. కాని మాంబాజీపండితున కింతవఱకును నయ్యది బోధపడియుండలేదు.

వెంక—నేటికిఁగాకన్న నేటిదినంబుననైన నాతఁడు నిజశత్రువును గ్రహింపఁగలఁడు

తుకా—ఆవిషయమున సందేహ మెన్నటికిని లేదు. నేఁడే యాతఁడు పశ్చాత్తాపతప్తుఁడై యరుదెంచును. శివాజీమహారాజు మన యింట నుండెనని సైనికులకుఁ దెల్పినవాఁడుఁగూడ నాతఁడే యగును.

(ప్రవేశము:—మూస్వాజీ.)

మూస్వా—స్వామీ! రక్షింపవలయును. నమస్కరించును)

తుకా—మూస్వాజీ! రక్షించుట కాపండరినాథుఁడే కలఁడు ఆతనికి నమస్కరింపుము. ఆతనినే శరణంబు గాఁదలంచుము. ఇంత కంటె నీకుఁ జెప్పవలసినది లేదు.

మూస్వా—మహాత్మా! తమయనుగ్రహమున పండరీనాథుఁ డెంతఁగా భక్తులయెడ వాత్సల్యమును వహించియుండునో ప్రత్యక్షము గాఁ గనుఁగొంటిని.

తుకా—అదేమి?

మూస్వా—ఔరంగజేబుసైన్యాధిపతి పంపిన గూఢచారులకు మేమే శివాజీ తమగృహమున నుండెనని చెప్పియుంటిమి.

తుకా—ఆవిషయమును నే నెఱింగియుంటిని.

మూస్వా—తమపరి కొలఁదిదివసములలో సైన్యము తమగృహమును ముట్టడించెను. ఇచ్చట కోలాహలముగా నున్నసమయమున మాకు దూరమున శివాజీయున్నట్లు కాన్పించెను. తోడనే మేము సేనానాయకుని కావర్తమానము దెల్పితిమి. తోడనే సైన్యమంతయును యావిధంబునఁ గాన్పించిన శివాజీని ముట్ట డించుట కేగినది. మేమును కుతూహలమున నాసైన్యమువెనుక నేగితిమి. సైన్యమంతయును పగతు రెవ్వరును లేకుండఁగనే

నాశన మయ్యెను. మే మీచిత్రముఁగూర్చి మీకు వివరించుటకు వచ్చుచు, నామహారా జిచ్చటనుండి వెడలిపోవుచుండుట ప్రత్యక్షముగాఁ దిలకించితిమి. పాండురంగఁడే శివాజీరూపమున నాసైన్యమును భ్రమించియుండునని స్థిరపఱచుకొంటిమి

**తుకా**—నాయనా! వాస్తవముగా జరిగినదిగూడ నదే. పాండురంగఁడు నీకు శివాజీరూపమున సాక్షాత్కరించి నీకు జ్ఞానమార్గము నుపదేశించియున్నాఁడు. ఇంతకంటె వాంఛింపఁదగిన దేమున్నది.

**మూస్వా**—మహాత్మా! ఇంక నొక్కవిషయము మర్థింప నెంచియుంటిని. నన్ను తమతో పండరిపురంబునకుఁ, గొనిపోయి పాండురంగని సేవాభాగ్యము నాకుఁ గలుగున ట్లనుగ్రహింపవలయును.

**తుకా**—అట్లే జరుగఁగలదు జాగేల? నేఁడే బయలుదేఱుదము.

(అని యందఱును భజన సేయుచు నిష్క్రమింతురు.)

తెర వ్రాలును.

ఇ ది పం చ మాం క ము.





# భక్త తుకారాము.

## షష్ఠాంకము.

### ప్రథమరంగము.

పండరిపురమున నొక వీధి.

(తుకారాము భజనసమూహము వెంబడింపఁగా ప్రవేశించును.)

తుకా—(భజన నించుక నిల్పి) పాండురంగ విఠలునకు జయ్! రంగనాథునకు జయ్! అహా! నిరంతర మీరంగనాథుని స్మరించుచుండుటచే నెంతటి యానందము గలుగుచున్నది. దేవాలయము సమీపించిన కొలఁదిని యానంద మతిశయించుచున్నది.

[ప్రవేశము:—జీజీభాయి.]

జీజీ—[పరువుపఁబోయి తుకారాము పాదములపై వ్రాలి] నాథా! నాథా!! ఇట్లొనరించుట మీకు భావ్యమా! తమ పదరాజీవములే యెడ్గడ యని భావించుకొని వర్తించు నన్ను విడచి తామీపండరీపురముననే వసించుట మీకుఁజెల్లునా? నే నీకుటుంబభారము తియును వహింపఁగలుగుదునా? నన్నింక రక్షించువారెవ్వరున్నారు.?

తుకా—సాధ్వీ! నాపాదములపై నేల వ్రాలి శోకించెదవు? నేను నిన్ను విడచివచ్చి రెండుమాసములైన గాలేదే యింతలోననే యింత

గా వగిగొంటివా? నిను రక్షింప నాజననీ జనకులుండగా నీవేల శోకించెదవు.

జీజీ—స్వర్గస్థులైయున్న తమ దల్లిదండ్రులు నన్ను రక్షింపఁగలరా?

తుకా—ప్రియా ! జీజీభాయీ !! నా తల్లిదండ్రు లెవ్వరో యించుక వచించెద నాలింపుము. జననమరణాది వికారషట్కము లెఱుఁగని వాఁడును, నిత్యసత్యజ్ఞానానంద స్వరూపుఁడును, బ్రహ్మాండకటాహకోటికి గర్తయు భర్తయు హర్తయు తానెయై వెలుఁగు వాఁడును నామరూపరహితుఁడగుటచే దన్నేనామమున స్మరించిన భక్తాగ్రేసరుల కారూపమున సాక్షాత్కరించువాఁడును అగు పాండురంగవిఠలుఁడే నాతండ్రి. జగజ్జనని యగు నిందిరా దేవియే నాజనయిత్రి. ఈదివ్యదంపతులే లోకమునకు తల్లిదండ్రులు. నీవును నావలె పాండురంగడే తండ్రియనియు ఇందిరా దేవియే తల్లియనియు భావించి యాశ్రయింపకుండుటచే వారు నాతలిదండ్రులని పక్కాణించియుంటివి. నీవును యాదివ్యదంపతుల నాశ్రయించితివేని నీకెట్టి కొఱఁతయు గలుగనేరదు.

జీజీ—నాథా ! నాయపరాధమును సహింపుఁడు. తమ యుపదేశామృతముచే నంతరంగమున నింతింతనరాని యానందము జనించుచున్నది కాని నాథా ! శూన్యమైయున్న గృహమున కే నరుగజాలను. నేనును తమకు శిష్యురాలనై తమతోడనే రంగని నామసంకీర్తన మొనరించుచుండెదను. ఇంటి కరుగుదము రండు.

తుకా—నీతో గృహమున కరుదెంచుట కెట్టి యభ్యంతరమును లేదు.

గీ. కర్మమున కధీనమై ♦ కడచునట్టి
జీవయాత్రకై నీమది ♦ చింతపడక
పండరీనాథు నిరతంబు ♦ భజనసేయు
నిచ్చగించిన నింట వ ♦ సించువాఁడ.

పాండురంగవిఠలుని భజనమునకు నుంత యవరోధము కల్గినను సహింపఁజాలను.

జీజీ—నాథా! తమ యిచ్ఛవచ్చినట్లు వర్తింపగలను. కావున నను గ్రహించి గృహంబునకు దయ సేయువలయును.

తుకా—రంగా! పాండురంగా! మరల నన్ను సంసారసాగరమునఁ బడ వైచుచున్నాఁడవా?

జీజీ—నాథా! ఇఁక నాలస్యము చేయు టెందులకు? విఠలుని సందర్శించి గృహంబున కరుగుదము రండు.

(తుకారాము మున్నుగువా రందఱును భజనసల్పుచు నిష్క్రమింపఁగా తెరవాలును.)

---

## ద్వి తీ య రం గ ము.

పండరీపుర దేవాలయ ప్రాంతోద్యానవనము.

(ప్రవేశము—యేకవస్త్ర యగు జీజీభాయి.)

జీజీ—నాథా! ఇదెక్కడి న్యాయము? పాండురంగడే సర్వమునకుఁ గారణుఁడని వచించి యింటగల పదార్థము లన్నియును భక్తులకు దాన మొసంగివైచితివా? అంతలో తనివినొందక స్నాన మొనర్చి మార్చవైచుకొనిన చీరెనగూడ దానమొసంగివైచితిరా? ఎట్లు సహింతును. యేకవస్త్రనై యెట్లు మెలంగుచుండఁ గలను. పండరీనాథా! నీ పాదపద్మము లాశ్రయించినందుల కిదిఫలంబా!

సీ. భువనమోహన! నీ య • పూర్వమంగళరూప
మెద నిల్పినందుల • కిదిఫలంబ!

సతతంబు నీనామ ♦ సంకీర్తనము చేసి
ముద మొందినందుల కిదిఫలంబ!
తృప్తాజ్ఞ గావించు ♦ తతి నాహ్వానబ్జ య
ర్పించుకొన్నందుల ♦ కిది ఫలంబ!
ఆశ్రితావనుండ వీ ♦ వను నాశతో నిన్ను
మది నమ్మినందుల ♦ కిది ఫలంబ!

గీ. భక్తజనరక్షకుండ వంచు ♦ భావమందు
నెంచి సేవించినందుల ♦ కిది ఫలంబ!
ఎపుడు పరదైవతమ్ముల ♦ నించుకంత!
యేని దలపోయనందుల ♦ కిదిఫలంబ!

గీ. కాలభేదంబు లేక నే ♦ కాగ్రచిత్త
మునను భజియించు సద్భక్త ♦ జనులకెల్ల
ముదము చేకూర్ప కిటు బుద్ధి ♦ పూర్వకముగ
వెతలఁ గల్పించుచుందువే ♦ విఠలనాధా!

నీపాదముల నమ్మి భజించిన వారి కాపదలు గల్గుట తప్పదా పాండురంగా! ఇదియేనా నీభక్తవాత్సల్యత? కట్టా! ఎంత గా మోసగింపబడితిని, నీ పాదపద్మము లాశ్రయించుతలంపు గల్గినతోడ నే విరక్తిభావ మంకురించినది. భర్తగా రుపదేశించి నదే వేదమనుకొని యున్నదంతయును భక్తుల సమారాధనకై యూడ్చి పెట్టితిని. కాని నీవు సంతృప్తివహింపక ద న్నేకవస్త్రను గావించి విడిచితివి. ఇయ్యది సహింపరానిదై యున్నది. నీనైజ గుణ మిట్టిదని లోకమున ప్రకటించెదను. ముందెవ్వరును మా వలె నున్నదంతయును నీ కర్పణ మొనర్చి యాలుబిడ్డల నేడ్పిం చుచు నున్మత్తులవగిది చరింపకుండునట్లు గావించెదను. ఎవ్వని

పాదము లాశ్రయించిన నిట్టి యనర్థములు భక్తులకుఁ గల్గుచుం డునో వానిపాదములను నలఁగఁగొట్టెదను అంతవఱకు నాహృదయసంతాపము చల్లారనేరదు (అని ఎదుటనున్న రాతి నొక్కదాని నెత్తి) పాండురంగా! రంగా!! నన్ను మోసగించినందులకుఁ దగిన శిక్ష విధి వ సిదే యరుదెంచుచుంటిని. సిద్ధముగా నుండుము.

(ప్రవేశము:—తుకారాము)

తుకా—ఎందుకు సిద్ధముగా నుండవలయును?

జీజీ—వచ్చితిరా! రండు. రండు. ఎవ్వనిపాదము లాశ్రయించుటచే మనకు మతిభ్రమణము గల్గి యున్నదో తనియును నిశ్వార్పణము గావించియుంటిమో యామోసగానికి దగుశిక్ష నొసంగుటకరుగుచున్నాను.

తుకా—ఇవేమిమాటలు నీమతి చలించినదా? శరీరమున స్వస్థత జెందియున్నదా?

జీజీ—నామతి చలించినమాట యథార్థము పాండురంగని స్మరించుటకారంభించిననాఁడే నామతి చలించినది.

తుకా—ఈపాషాణము నేమిచేయతలంచితివి? మోక్షదాత యగు పాండురంగని పాదపద్మముల నారాధించుటచే నీకు సంపూర్ణవైరాగ్యము గల్గినది.

జీజీ—లేదు లేదు. లేనిపోని వైరాగ్యము మిమ్మావహించినది. కావుననే కట్టుపుట్టమునుఁగూడ దాన మొసంగితిరి. ఇఁక సహింపఁజాలను. ఇట్టి యాపదల ముంచి బాధించు పాండురంగని పదముల నలఁగఁగొట్టెదను.

(ముందున కేగఁబోవును.)

తుకా—(అక్కడనుండి) ప్రియా! జీజీబాయి! త్వరపడకుము. పండరీనాధున కట్టిశిక్ష విధింపనెంచితివో యాశిక్షను నేనే యనుభవించెదను. ఆపెనురాతిని నాపాదములపైఁ బడవేయుము, సహింతును. నిష్కారణముగా భక్తపరాధీనుఁడగు రంగనాధుని నిందింపకుము.

(జీజీభాయి ముందునకుఁ బోవును. తెరయెత్తఁగా పాండురంగఁడు రుక్మిణీసహితుఁడై యుండుటఁ గాన్పించును)

జీజీ—రంగా! రంగా!! దుర్భరదారిద్ర్యమున మంచి యల్లాడించిన సహించితిని. ఆలుమగల కెడఁబాటు గల్గించిన సహించితిని. నిర్వహింప నశక్యమగు సంసారభారమును నాభుజములపైఁ బడవైచిన సహించితిని. తినుట కొకపూట కింతయున్నమైన లేకుండఁ జేసిన నోర్చియుంటిని. కాని నీకింకను దయ రాలేదు. ఇంకను నీవిషమపరీక్షలు చాలింపవైతివి. అశక్తుఁడవై యుపేక్ష వహించిన నిన్ను యింక నెవ్వరును యాశ్రయించి మోసగింపఁబడకుండఁ గావింప సంకల్పించుకొంటిని.

(సమీపించును. తెర వ్రాలును.)

తుకా—పాండురంగా! భక్తిపథమున నీయనుగ్రహసంపాదనమున కనవరతము యత్నించుచున్న నాపైఁ నికేల కరుణ కలుగదు? వైరమున నిను సాధింపనెంచిన నాయిల్లాలికి నీసాయుజ్య మొసంగియుంటివా? రంగా! రంగా!! నీలీల లనంతములు.

గీ. వైరమున నైననినుఁ దమ ♦ భావమందు
దలఁచువారలకు సన్ని ♦ ధాన మిచ్చి
యహరహంబును రక్షింతు ♦ వనుట యిట్లు
ప్రకటనము నేయ నెంచితే ♦ పాండురంగ!

నీయెడ నెట్టియుపచారము గావించియుంటినని నను బహిష్క-
రించితివి? నీకు నాపై నించుక యనుగ్రహము జనింప
లేదా, (అని ధ్యానించుచుండును)

జీజీభాయి వస్త్రాభరణముల నొడికట్టున నుంచుకొని
ప్రవేశించును)

జీజీభాయి—(సంతోషముతో తుకారాముని సమీపించి) నాథా, లెండు. లెండు పాండురంగఁడు నేఁడు మన పాలిట కల్పవృక్షమై యున్నాఁడు. ఇదే తిలకించితిరా, యనర్ఘభూషణములను దుకూలములను నాకొసంగి పోయిరావలసిన దని పంపించి యుండెను.

తుకా—[కండ్లుదెఱచి భార్యను జూచి] ఏమనుచుంటివి? పండరీనాథుఁడు మనపాలిటి కల్పవృక్షమై నీకాభరణాదికముల నొసంగి యుండెనా? నీవు వానిఁ గొనవచ్చితివా? ఎంతటి యకార్య మొనర్చితివి? ఇంతటి విశ్వాసరాహిత్యము నీ కెట్లలవడినది. నీ హృదయమున నవిశ్వాసము నెలకొని నిన్ను సంపూర్ణఫలప్రాప్తికి దూరగురాలి నొనర్చియుండెను. భక్తిమార్గమున సకవర్గములు సాధించుటకు మాఱుగా వస్త్రాభరణములఁ గొని తెచ్చుకొని సంతసించుచుంటివా? సర్వానర్థములకాకరంబగు నీయర్థంబు నపేక్షించి తెచ్చుకొంటివి గావున పోయి యనుభవింపుము.

జీజీ—నాథా, నాథా, క్షమింపుఁడు. యపరాధిని క్షమింపుఁడు. దుర్భరావమానమునకు గుఱియైతిని గదా యను శోకమున నవివేకినై ప్రవర్తించితిని.

[వస్త్రాభరణము లన్నియు సాధువులకు పంచియొసంగును]

తుకా—నిష్కళంకమగు భక్తితో పండరీ నాథు నింక సేవించి శుభంబులఁ బడయుగలవు. పాండురంగా! నాయిల్లాలికి సుజ్ఞానోద

యమును గల్గించినందులకు నీ కిదే ప్రణామశత మర్పించు చున్నాఁడను. [భక్తులతో] మహాత్ములారా, విఠోబా నామ సంకీర్తనము గావింతమా?

సాధు—చిత్తము.

తుకా—

మ. మనమున్ నీవయినిల్పి యెవ్వరిల నం ♦ భావింపగా నెంచుచు నీ గనులారన్ భవదీయరూపము గనం ♦ గా గోర్కె సారింతు రె వ్వరు నీపూజలు చేతులార సలుపన్ ♦ బుద్ధిన్ బచాలింతు రా ఘురు లిష్టార్థము లొందువారలె యనం ♦ గా సందియం బున్నదే.

[అందఱు భజనసేయుచుందురు]

[తెరలో కలకలము]

తుకా—(భజనసేయుట నిల్పి) ఏమీ కలకలము.

[తెరలో]

మహాత్ములారా, తుకారామమహాశయుఁ డెందున్నవాఁడో తెల్పుడు.

తుకా—[తనలో] నాకొఱకే యెవ్వరో యిట్లరుదెంచుచున్నారు.

[ప్రవేశము]—కొందఱు పౌరులు. ఒకబాలుని మృతకళేబరమును మోచుకొని వత్తురు.)

1 స్త్రీ—[బాలుని శవమును క్రిందఁ బరుండఁబెట్టి] అయ్యా, తమరేనా తుకారాములు? మహానుభావా, తమవలన మాకుటుంబమున కెట్టియాపద కల్గినదో పరికించితిరా?

తుకా—తల్లీ, నేను బుద్ధిపూర్వకముగా నీకెట్టియాపదను గల్గింప లేదు.

స్త్రీ—అయ్యా, తాము భక్తాగ్రేసరు లయినఁ గావచ్చును. కాని గ్రామములోనివారి కెల్లరకును భక్తితత్త్వముల నుపదేశించు

చూడిరి. తమబోధన మాలించి సాధర్తు కుమారుని రుగ్మత
నైన గుర్తింప నుపేక్షించి చికిత్స చేయింపనందున నీబాలుఁడు
మరణించినాఁడు.

తుకా—కుమారుని మరణమునకు శోకించుచుంటివా?

స్త్రీ—అయ్యా! కుమారునకై శోకించుచుంటివా యని ప్రశ్నించు
చుంటిరా! గోత్రాభివృద్ధికై వంశలంతాకూరమగు బాలకుఁడు
మరణించిన దుఃఖింపనివా రుందురా?

తుకా—పుత్రవిశ్లేషము దుఃఖకారణము గాదనుటలేదు. కాని యీ
బాలుని నాచెంత కేల గొనివచ్చితిరి?

1 పౌరు—పిచ్చిదానా! ఈతుకారాముని చెంత నమృతమున్నదని భావిం
చితివా! నీబిడ్డను బ్రతికించునని తలంచితివా!

తుకా—నాయనలారా! నాచెంత నమృతము లేదు. కాని యమృత
ముకంటె మధురమైనదై, యధికతరానంద మొసఁగూర్పఁగల
దైన రామనామామృత మున్నది? అమృతముకైన విలువ
నేర్పరుపఁగుదు గాని శ్రీరంగనాథుని నామామృతమునకు విలువ
నేర్పరుపఁజాలినవా రెవ్వరును లేరు.

2 పౌరు—రంగని నామామృతమున నీబాలుఁడు పునర్జీవితుఁ డగునా?
కానినాఁ డారంగనాథుని సేవించుట వ్యర్థము గాదా!

తుకా—రంగని నామామృత మిట్టిమహిమాన్విత మని వక్కాణింప
నలవి యగునా? ఒక్కకంఠమున మీరెల్లరును ఒక్కసారి
విఠోబాను సంస్మరింపుడు. ఈబాలుడు నిద్రించినవానికై వడి
మేల్కొనును. (అందఱును భజన సేయుదురు)

(మృతుఁడైన బాలుఁడు మేల్కొనినట్లుగా లేచి కూర్చుండును.
ఎల్ల రాశ్చర్యమునొందుదురు.)

తుకా—సోదరులారా! మీరెల్ల రాశ్చర్యము జెందవలసినపనిలేదు. రంగని నామామృతమున నట్టిమహిమావిశేష మున్నది. ఇంకను వివరించెద నాలింపుఁడు

సీ. రంగని నామకీ ♦ ర్తన మొనరించిన
శత్రువర్గంబెల్ల ♦ సమసిపోవు
రంగని నామకీ ♦ ర్తన మొనరించిన
వాంఛితార్థంబులు ♦ బడయనగును
రంగని నామకీ ♦ ర్తన మొనరించిన
భవరోగనివహంబు ♦ పరుగులిడును
రంగని నామకీ ♦ ర్తన మొనరించిన
పాపసంచయమెల్ల ♦ భస్మమగును
వేయిపల్కులేల నేలను ♦ విడువకుండ
రంగనాథుని నామకీ ♦ ర్తన మొనర్చి
మానివరులకు నైనను ♦ బడయరాని
మోక్షలక్ష్మిని తృటిలోనఁ ♦ బొందనగును.

నాయకులారా! ఈకలియుగంబున మోక్షసామ్రాజ్యమును బడయుటకు రంగని నామసంకీర్తనమే ప్రధాన మైనదని భావింపుఁడు.

స్త్రీ—[తుకారామునకు నమస్కరించి] మహాత్మా! తమప్రభావ మెఱుంగనేరక గావించి యపరాధములు క్షమింపుఁడు

తుకా—క్షమించువాఁ డాపాండురంగఁడే! కావున నాతని పదపద్మము లాశ్రయింపుము.

(అందఱును భజన సేయుచు నిష్క్రమింతురు.)
తెర వ్రాలును.

# తృతీయరంగము.

---

## పాండురంగని దేవాలయము.

(పాండురంగఁడు, రుక్మిణి ప్రవేశించియుండ తెరయెత్తఁబడును.)

రుక్మి—నాథా! నేఁడు నీయుత్సవమును దిలకింప నెందఱెందఱో భక్తులరుదెంచియుండఁగా నీవిట్లు ఖిన్నుఁడవై యుంటివేల?

పాండు—ప్రియా! నీతోఁ జెప్పకున్న నామనోగత మింకెవ్వరి కెఱిగింతు నాలింపుము పరమభక్తాగ్రేసరుఁడగు తుకారాముఁడు పంపియుండిన యుత్తరమును వినినపిమ్మట నామనస్సు నిలుకడ లేక యల్లాడుచున్నది. నాభక్తుఁ డొక్కరుఁడు నావిశ్లేషము కోర్వఁజాలక పరితపించుచుండఁగా నీయుత్సవాదికములు నాకెట్లు సంతోష మొనఁగూర్పఁగలవు.

రుక్మి—నాథా! తుకారాము భక్తాగ్రేసరుఁడే యగును. ఆతనివిశ్లేషము తమకు సంతాపకారణము గావచ్చును కాని యిచ్చట నింతమందిభక్తులు తమదర్శనాపేక్షతో నరుదెంచి నిరీక్షించుచుండ తామిట్లు ఖిన్నులై వారలకు దర్శనమీయ కుపేక్షించుట పాడియా?

పాండు—ఆవిషయమునుగూర్చియే యాలోచించుచుంటిని. అతఁడు పూర్వజన్మసంచితార్థమున జ్వరపీడితుఁడై నడువ శక్తిలేమిచే రాఁజాలకుండెను. కావుననే యాతనికి దర్శన మొసంగవలసినదని యుత్తరమును బంపియుండెను. ఆతనికి దర్శన మొసంగువఱకును నామనంబున కుదుట గల్గుట కవకాశము లేనట్లున్నది.

రుక్మి—ఇట్లు సమావేశమైనవారల నుపేక్షించుట మీకు ధర్మమా? కావున నెవ్వరినైన బంపి యాతని నిచ్చటికే రప్పింపుడు.

పాండు—ఎవ్వరిని తుకారాము చెంతకుఁ బంపుమనియెదవు?
రుక్మి—వైనతేయుని బంపించరాదా?
పాండు—ఆ! మఱచితిని. వైనతేయుఁ డెక్కడ?
రుక్మి—వైనతేయా! వైనతేయా!!

(ప్రవేశము:—వైనతేయుఁడు.)

వైన—(రంగనాథునకును, రుక్మిణికి నమస్కరించి నిలుచును)
రంగ—వైనతేయా! పరమభక్తాగ్రేసరుఁడగు తుకారాముని సందర్శించి క్షేమ మరసి తానంపిన యుత్తరమును జనువ వింటినని వచింపుము. ఆతనిని నీమూపున నెక్కించుకొని యిచ్చటికిఁ దోడ్కొనిరమ్ము. నీవు త్వరలో రావలయును సుమా! ఆతనిని దర్శించువఱకు నా కూఱట చేకూరకున్నది.
వైన—చిత్తము. (నమస్కరించి నిష్క్రమించును.)
రుక్మి—వైనతేయుఁ డమితవేగుఁడు కాన త్వరలో మరల నరుదెంచును.
పాండు—ప్రియా! తుకారాముఁ డరుదెంచునని యె తలంచుచున్నావా? వైనతేయు నెందులకుఁ బంపియుంటినని యిపు డాలోచించుచున్నాడను.
రుక్మి—తాము రావలసినదని యాజ్ఞాపించియుండఁగా రాకుండునా?
పాండు—అట్లే భావించుచుంటిని.
రుక్మి—మీయాజ్ఞనే తిరస్కరించువాఁడా భక్తుడు!
పాండు—దేవి! అట్లు తలంపకుము. ఆతడు భక్తాగ్రగణ్యులలో తొలుదొల్త గణింపదగినవాడు.
రుక్మి—అట్లైన నాతఁడు తమయాజ్ఞానుసార మిచ్చటి కరుదెంచును.

(ప్రవేశము :—వైనతేయుఁడు)

రుక్మి—వైనతేయా ! తుకారాముని గొనివచ్చితివా?

వైన—(ఖిన్నుఁడై) లేదు.

పాండు—నేను వచింపలేదా?

రుక్మి—భగవానుని యాజ్ఞల తిరస్కరించెనా?

పాండు—వైనతేయా ! నీవు పోయివచ్చిన కార్యమునుగూర్చి నీ వివరముల నెఱిఁగించి యీమన సందేహమును నివారణ గావింపుము.

వైన—తల్లీ ! నే భక్తాగ్రేసరుని సందర్శించితిని. దేవదేవు నాజ్ఞఁ దెల్పితిని. తమ్ము నామూపునఁ గొనిరావలసినట్లుగా నాజ్ఞాపింపఁబడి యుంటినని వచించితిని.

రుక్మి—అందుల కాతఁ డేమనియెను?

వైన—వాసుదేవుని సందేశ మాలించుటచే సమానందకందళితుఁడ నయితినని వచించి, మఱియు నిట్లనియెను. "రంగనాథునకు నాపైఁగల్గు వాత్సల్య మిట్టిదని వచింపఁజాలను. ఆతని యాజ్ఞల శిరసావహించి, పండరి కరుదెంచుటకు సంకోచింపను. కాని, నేను లోకమర్యాదల నతిక్రమింపఁజాలకపోవుటచేఁ బండరికి రాఁజాలను. ఏమందువా? నీవు భగవానునకు సఖుఁడవై, వాహనమవై, ఆసనమవై, ధ్వజమవై, వితానమవై, వ్యజనమవై యున్నాఁడవు. అట్టియెడ, నీదాసుఁడ నగు నే నెట్లు నిన్నధిరోహించి పండరికి రాఁగలను ? కావున నాయార్తి నా పండరినాథున కెఱిఁగించి, నామనోరథము దీర్పఁ బ్రార్థింపుము.

పాండురం—అందులకు నీ వేమంటివి?

వైన—తుకారాముని భక్తితాత్పర్యముల కెంతయు విస్మయమునొంది, "సాధుజనాగ్రేసరా ! నీవు పండరీనాథుని సందర్శనమున కెంత

గాఁ బరితపించుచుంటివో యాఁగని కేటిగించి స్ఫటికాల మున నీమనోరథము దీర్చెద' నని వచించి యిట్లరుదెంచి యుంటిని.

పాండురంగడు:—

గీ. నాదువిశ్లేషమునను మ ♦ నంబునందు
నాతొ వగఁజెంది యతఁడు కృ ♦ శించియుండె;
జాల మొనరించుచో హాని ♦ సంభవించు;
నతని దర్శింప నిపుడు నే ♦ నరుగువాఁడ.

వైనతేయా! నంసిద్ధుఁడవు గమ్ము.

రుక్మి—నాథా! ఉత్సవార్థమై పెక్కురు భాగవతు లరుదెంచియున్నారు. మీ రిపుడు పండరీపురమును విడిచిపెట్టినయెడల, మంగళహీన మైన యీపురమును దిలకింపక మఱలిపోవుదురు. ఇంతియేగాక భక్తాగ్రగణ్యులగు మేకు మహాత్ముఁడు, గణేశనాథుఁడు, నింబ రాజు మున్నగువా రెందఱో యరుదెంచి, తమదర్శనార్థమై వేచియున్నారు. నింబరాజునకుఁ దాము దర్శన మొసంగి యను గ్రహింపవలసి యున్నది.

పాండు—ప్రియా! ఈనింబరాజునకు నీవు సాక్షాత్కరించి, నే నరుదెంచు నంతవఱకు నాతనిని దేవాలయములోనికి రానీయకుము. ఇదే తృటికాలములో వచ్చెదను.

(నిష్క్రమించును.)

రుక్మి—నింబరాజునకు సాక్షాత్కరించి వల్లభుఁ డానతిచ్చిన ట్లొనరించెదఁగాక! (నిష్క్రమించును.)

తెర వ్రాలును.

## తురీయరంగము.

### పాండురంగ దేవాలయము.

[షేకుమహమ్మదు, నింబరాజు, గణేశనాథుఁడు మున్నగు మహాభక్తులొకవంక నిలువఁబడియుందురు. మఱియొకప్రక్క తుకారాము మున్నగువారు నిలువఁబడి యుందురు. రంగనాథుఁడును రుక్మిణియు సింహాసనమున నాసీనులై యుందురు. వైనతేయుఁడు రంగనిచెంత మోకరించుకొని యుండును.]

తుకా—రంగా! పాండురంగా! కృపాంతరంగా, భక్తలోకైకపరిత్రాణశీలుఁడ వనుట యీవిధముగా ప్రకటించుచుంటివా?

శ్లో. హే గోపాలక హే కృపాజలనిధే హే సిన్ధుకన్యాపతే
హే కంసాన్తక హే గజేన్ద్రకరుణాపారీణ హే మాధవా
హే రామానుజ హే జగత్త్రయగురో హే పుణ్డరీకాక్ష మాం
హే గోపీజననాథ పాలయ పరం జానామి న త్వాం వినా.

సీ. నిన్ను నిర్గుణుఁడంచు ♦ నెన్నుచుండియు నన్ని
గుణములు నీకుఁ గ ♦ ల్పనము సేసి
నీకు నాకృతియె లే ♦ దనియు నెంచియును, స
ర్వాకృతులును నీకె ♦ యంటఁ గట్టి,
నిను జగద్వ్యాపకుం ♦ డని తలంచియు నీకు
వైకుంఠపురమె ని ♦ వాస మొసఁగి
నిన్నెల్లవారు మ ♦ న్నింతురం చెదనమ్మి
యును భక్తులకు సేవ ♦ కునిగఁ జేసి,
నతము వేదాంతులును, భక్త ♦ జనులు, మునులు
బ్రస్తుతులు చేసి, తనివోరి, ♦ పృథివిమీద

వారిధి నోలలాడుచు ♦ వఱలుచుండు
నట్టి భాగ్యము నాకు నేఁ డలరెఁ గాదె.

వైన—పాండురంగా, మేమెల్లర మీతుకారాముని యనుగ్రహవిశేష
మున భవద్దివ్యమంగళవిగ్రహమును సందర్శింపఁగల్గితిమి. మహా
మునులకైన నగోచరుఁడవగు నిన్నేమని నుతింతుము.

శ్లో. హంసాయ సత్త్వనిలయాయ సదాశ్రయాయ
నారాయణాయ నిఖిలాయ నిరాశ్రయాయ
సత్సంగ్రహాయ సగుణాయ సదీశ్వరాయ
సంపూర్ణపుణ్యపతియే హరియే నమస్తే.

శా. ఓరాజీవ నిభప్రదీప్తనయనా! ♦ యుద్యన్మహామంగళా
కారా! దీనజనావనా! నిఖిలలో ♦ కక్షేమసంధాయకా
శ్రీరామానవపల్లవాధర సుధా ♦ శ్రీసేవనాసక్త! నీ
కారుణ్యాతిశయప్రదానమున రం ♦ గా! నన్నుఁ బ్రోవంగదే!.

వైశు—విఠలనాథా, నీదివ్యమంగళవిగ్రహమును గనులారఁ దిలకించు
టచేఁ జరితార్థుల మైతిమి.

శ్లో. యజ్ఞేశాచ్యుత గోవింద । మాధవానన్త కేశవ
కృష్ణ విష్ణో హృషీకేశ । వాసుదేవ నమోఽస్తు తే.

శ్లో. నమః కృష్ణాయ దేవాయ । బ్రహ్మణేనన్తశక్తయే
యోగీశ్వరాయ యోగాయ । త్వామహం శరణం వ్రజః.

శ్లో. కృష్ణాయ వాసుదేవాయ । దేవకీనన్దనాయ చ
నన్దగోపకుమారాయ । గోవిన్దాయ నమో నమః

ఉ. నీరమణీయమైన ముఖ ♦ నీరజమున్ గనినంత, నీదు వి
స్తార పవిత్రచిత్ర చరి ♦ తంబు సుభక్తిని విన్నయంత, నీ

సారతరప్రశస్త గుణ ♦ సంస్తుతి సల్పిరయ్యెను, వింతగా
మారెను నాదు డెందము; సమస్తము చేకురి నట్లె యయ్యెగా.

పాండు—(తుకారామునితో) భక్తజనాగ్రేసరా! నీవాంఛితార్థము లన్నియు సమకూరినవి. నీవు మహారాష్ట్రభాషయందు రచించిన కృతులు సర్వజనాదరణీయములై లోకమునకు మహోపకార మాచరింపఁగలవు. నీవు భక్తితత్వమును లోకమునకిఁకను బోధించి తదుపరి నిజశరీరముతో కైవల్యము నందఁగలవు ఇంక వాంఛింపఁదగిన దేమున్నది?

తుకా—లోకైకకళ్యాణస్వరూపుండవగు మిమ్ములను దర్శింపఁగలుగుటచే మా వాంఛితార్థము లన్నియు నీడేఱినవి. తాము వరము ప్రసాదింతుననుచుండిరి గావున నిట్లనుగ్రహింపుఁడు.

భ ర త వా క్య ము.

తే. గీ. ధరణి సస్యార్ధ్య యగుచును ♦ దనరుఁగాక!
ప్రజలు సంతోషభరితులై ♦ భక్తిపథము
బట్టుదురుగాక సద్భక్త ♦ వరులు వాంఛి
తార్థముల నొందుదురుగాక! ♦ యహరహంబు.

పాండు—తథాస్తు

(తె ర వ్రా లు ను.)

స ం పూ ర్ణ ము.



# అనుబంధములు

8 పేజీ—పంక్తి 19

తుకారాము:—

రంగా! కావవా? కరుణాసింధో! కాపాడగ లేవా?
కరుణింప రాలేవా భక్తుని దయఁగన వేలా?
మోహపాశములఁ బోలేలా నీమోము జూపగ రావేలా!
మందరగిరిధర! మహితకృపాకర!
నను దరిజేర్పుము నందకుమారా!

---

13 పేజీ—పంక్తి 18

తుకారాము:—

సంసారజలధిలోఁ గూలి తపింపగ
నుద్ధరింప నూహింపఁగరాదా॥ రంగా॥
నీపదాంభోజ సంసేవన మొసంగి
నాయార్తి బాపగ నూహింపగరాదా॥ రంగా॥
అఖిలమునకు నీవే యాధారుడవని
తలచెడి నన్నిటు లుద్ధరింప నూహించెదవో॥ రంగా॥

---

15 పేజీ—పంక్తి 7.

తుకారాము:—

సతతము నీపద సేవన మొసగి నన్
కరుణింపగ మది దలంపుమా॥ రంగ॥

నీనామకీర్తనము-నిరతముజేసెడి
భాగ్య మొసంగుమా-పండరినిలయా॥౮౦౫॥

---

16 పేజీ—పం_ 24.

తుకారాము:—

పండరినాథా ! నన్నిటు పరీక్షింతువా ?
అడవిస్థలమున నొంటిగ విడచిన
యెటునుందునో గనవె-చతివా॥౮ ౫॥
నీపరీక్షలకు - నిలచియుండగా
నెంతవాడనని యూహించితివో॥౮౬౫॥

---

24 పేజీ—పంక్తి 18

తుకా:—భజనకీర్తన.

పండరినాథా ! పాహికృపాకర !
పండరినాథా ! పావననామా॥పండరి॥
దీనదయాళో — దీనదయాపర
దిక్కునీవెకా — పండరినాథా॥పండరి॥
భక్తరక్షకా - సాధుపోషకా
లోకరక్షకా - పండరినాథా ॥పండరి॥
పతితపావనా - పావననామా
భవ్యచరిత్రా - పండరినాథా॥పండరి॥
సాధురక్షకా - సజ్జనపాలక
సన్మునివందిత - సత్యస్వరూపా॥పండరి॥

27 పేజీ—పంక్తి 9.

తుకారాము:—

చింతింపగదగునా ?
సాధుజనులకై ధనమర్పించితినని ॥చిం॥
రంగనాధుండే కరుణించియొసగిన
ధనమాతనికే యర్పించితినని ॥చిం॥
సాధసేవయే - మోక్షసాధనమని దెలిసియు
సాధుజనులకై ధనమర్పించితినని ॥చి ॥

37 పేజీ—పంక్తి 12.

తుకారాము:— పో బోకుమా ! రంగా ॥పో బోకుమా !
రంగా - పో బోకుమా !
అనుగ్రహింపగా - నరుదెంచియు
దర్శనమీయక - తరలుచుంటివా ॥రంగా॥
పిలుచుచున్నా - పల్కులాలింపక
ఈవిధి నరుగుట - నీకు భావ్యమా ॥రంగా॥

58 పేజీ—పంక్తి 23.

తుకారాము:—

రంగాకథానురసము గ్రోలినన్
కామక్రోధములు సమయునుగా ॥రంగ॥
కామిత ఫలదాతా యనినన్
కామితార్థములు చేకూరునుగా ॥రంగ॥

పతితపావనుని పావననామము
పాపాటవులనుభస్మము సేయుగా ॥౮౯॥
పండరీశుని భావించినయెడ
బ్రహ్మానందము లభియించునుగా ॥౯౦॥

73 పేజీ—పఙ్క్తి 12.

మాస్వాజీ:—

గురువరా! నను క్షమియింపరా
భక్తితత్వమును బోధసేసి నా
పాపముల పారద్రోలరా ॥గురువరా॥
త్వాద్ధ్రుశభక్తుల మహిమ నెఱుగక
పాపమున కొడిగట్టిన పాపిని॥ గురువరా॥

75 పేజీ—పంక్తి 12.

భజనకీర్తన.

భజనసేయుమా ♦ పండరినాథుని॥ భజన॥
కరివరదుండని ♦ కరుణాకరుడని
భావమునసుగని ♦ పరమభక్తితో॥ భజన॥
దానవవరదుడని ♦ దయాపరుండని
మదిలోఁ దలఁచుచు ♦ మాన కెప్పుడును ॥భజ॥
ఖగనాథుండని ♦ కమలాధిభుండని
నెదనూహించుచు ♦ నిరతము భక్తితో॥ భజ॥

78 పేజీ—పంక్తి 14.

భజనకీర్తన.

పండరికరుగగరండు ! పాండురంగనిగనుడు॥
భక్తకోటికావాసముపండరి
భక్తవరదునావాసముపండరి॥ పండరి॥
భక్తలోకపరిపాలనశీలుడు
వెలసియున్న వైకుంఠముపండరి॥ పండరి॥
సంసారజలధిని దాటింపగ
రంగనిభజనమె నాయనుచు॥ పండరి॥

---

79 పేజీ—పంక్తి 6.

భజనకీర్తన.

మముదయగనుమా - మారమణీరమణా !
నీసేవసేయు లేకెఱుగనివారము
జ్ఞానహీనులము మముదయగనుమా॥ మార॥
పాపాటవులను బడితిరిగెడిమము
కరుణనుగావగరమ్మా ! మారమణీరమణా॥

---

శ్రీచింతామణీ ప్రెస్, రాజమండ్రి.



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA128B104 |
| పుస్తకం పేరు | భక్తతుకారాము |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 105 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | munisha |
| పేజీలు విడదీసినది | munisha |
| స్కాన్ చేసినది | Ch. Ramya |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | GOOD |